ఓమ్

# అష్టావక్రసంహితా

## ప్రథమోఽధ్యాయః



### ఆత్మోపదేశప్రకరణమ్

జనక ఉవాచ:—

శ్లో. కథం జ్ఞానమవాప్నోతి కథం ముక్తిర్భవిష్యతి,
వైరాగ్యం చ కథం ప్రాప్త మేతద్బ్రూహి మమ ప్రభో. ౧

తాత్పర్యము. ప్రభూ! జ్ఞాన మెట్లు కలుగును? ముక్తి యేవిధమున దొరకును? వైరాగ్య మేరీతిని లభించును? వీనిని నాకుఁ జెప్పుఁడు.

అష్టావక్ర ఉవాచ:—

ముక్తి మిచ్ఛసి చేత్తాత విషయాన్ విషవ త్త్యజ,
క్షమార్జవదయాతోషసత్యం పీయూషవద్భజ. ౨

వత్సా! ముక్తికోరుదువేని విషయసుఖముల విషములని విడువుము. క్షమ, ఆర్జవము, దయ, సంతోషము, సత్యము వీని నమృతముగాఁద్రావుము.

న పృథ్వీ న జలం నాగ్నిర్న వాయుర్ద్యౌర్న వా భవాన్,
ఏషాం సాక్షిణమాత్మానం చిద్రూపం విద్ధి ముక్తయే. 3

పృథివ్యాదిపంచభూతములలో నీ వేమియును గావు. వీని యన్నిటికి సాక్షిమాత్ర మగుచిద్రూప మైనయాత్మ పదార్థమే నీవు. ఈయెఱుకయే ముక్తి.

ఓమ్

# అష్టావక్రసంహిత

## ప్రథమాధ్యాయము



### ఆత్మోపదేశప్రకరణము

జనకుఁడు:—

గీ. జ్ఞానమెట్టులు సంప్రాప్తమౌను? దేవ!
ముక్తిసౌఖ్యము నేరీతిఁ బొందవచ్చు?
నేవిధంబున వైరాగ్య మెలమిఁ గలుగు?
వీనిఁ దెలుపంగదే ప్రభూ! విస్తరించి. ౧

అష్టావక్రుఁడు:—

గీ. ముక్తి వాంఛించెదేని యో పుత్ర! నీవు
విషమురీతిని విడువుము విషయతృష్ణ
సత్యసంతోషశమదయార్జవము లెల్లఁ
గ్రోలుమోయి పీయూషంబుఁ గ్రోలు నట్లు. ౨

గీ. కావు పృథివిని జలమును గావు నీవు
కా వనల మనిలముఁ గావు; కావు దివివి
ఇన్నిటికి సాక్షిమాత్రుఁడ వెలుఁగు మాత్మ
వదియె చిద్రూప మది గాంచు టగును ముక్తి. ౩

యదిదేహం పృథక్కృత్య చితి విశ్రామ్య తిష్ఠసి,
అధునైవ సుఖీ శాంతో బంధముక్తో భవిష్యసి. ౪

దేహమును దేహిని విడఁదీసి శుద్ధచైతన్యమున విశ్రాంతినందుము. అపుడే శాంతిసౌఖ్యములు కలుగును. బంధవిముక్తి యగును.

న త్వం విప్రాదికో వర్ణో నాశ్రమీ నాక్షగోచరః,
అసంగోఽసి నిరాకారో విశ్వసాక్షీ సుఖీ భవ. ౫

నీకు విప్రత్వాదిజాతికాని బ్రహ్మచర్యాద్యాశ్రమముకాని లేదు. నీవు నేత్రగోచరుఁడవే కావు. అసంగివి. నిరాకారివి. విశ్వసాక్షివి. సుఖీభవ!

ధర్మాధర్మౌ సుఖందుఃఖం మానసాని న తే విభో,
న కర్తాసి న భోక్తాసి ముక్తఏవాసి సర్వదా. ౬

ధర్మాధర్మములు సుఖదుఃఖములు నీమనస్సునుండి పుట్టినవే కాని నీకు సంబంధించినవి కావు. నీవు కర్తృత్వభోక్తృత్వములు లేని నిత్యముక్తుఁడవు.

ఏకో ద్రష్టాసి సర్వస్య ముక్తిప్రాయోసి సర్వదా,
అయమేవ హి తే బంధో ద్రష్టారం పశ్యసీతరమ్. ౭

సకలసృష్టిలోను నీవే ద్రష్టవు. నీవే నిత్యముక్తుఁడవు. నీ విది మఱచి యొవఁడో ద్రష్ట కలఁ డనుకొనుటే నీకు మహాబంధ మైనది.

అహం కర్తేత్యహంమాన మహాకృష్ణాహిదంశితః,
నాహం కర్తేతి విశ్వాసామృతం పీత్వా సుఖీ భవ. ౮

'నేను, నాది' యనుభావ మనునల్లత్రాచు నిన్నుఁ గఱచినది. దానికి విఱుగు డగు 'నేను కర్తనుగాను' అనువిశ్వాససుధఁ ద్రావి సుఖింపుము.

ఏకో విశుద్ధబోధోహమితి నిశ్చయవహ్నినా,
ప్రజ్వాల్యజ్ఞానగహనం వీతశోకః సుఖీ భవ. ౯

'నేనే యేక మగువిశుద్ధవిజ్ఞానమూర్తి' ననునిశ్చయాగ్నిచే నజ్ఞానారణ్యము దహించి యశోకమున సుఖ ముందుము.

గీ. దేహి దేహము విడఁదీసి దేహి యైన
చిత్తునందున విశ్రాంతి చెందుదేని
క్షణములోపల శాంతిసౌఖ్యముల నంది
అఖిలబంధవిముక్తుఁడ వగుదు వీవు. ౪

గీ. బ్రాహ్మణాదిక మైన వర్ణంబు లేదు
నీకు నాశ్రమమే లేదు నేత్రములకుఁ
గానరా వసంగివి నిరాకారి వీవు
విశ్వసాక్షీవు సుఖముండు శాశ్వతముగ. ౫

గీ. సకలసుఖదుఃఖములు మనస్సంజనితము
లగును ధర్మం బధర్మంబు నటులె రాజ!
కర్తవును గావు మఱియు భోక్తవును గావు
ముక్తపురుషుఁడ వగుదు వెప్పుడును నీవు. ౬

గీ. సర్వజీవుల నీవ ద్రష్టవు దలంప
నిత్యముక్తుఁడవును నీవ నిశ్చయముగ
అన్యు నొక్కని ద్రష్టగా నరయుచుంట
ప్రబలబంధనప్రాప్తికారణము నీకు. ౭

గీ. 'నేనె కర్తను' ననునహం మానకృష్ణ
సర్పదష్టుండవౌ నీవు సత్వరముగ
'నేను కర్తనుగా' నను నిశ్చయసుధఁ
గ్రోలి సౌఖ్యంపునిట్టలఁ దేలుమయ్య! ౮

గీ. 'ఏ నొకండ, విశుద్ధబోధానవద్య
ప్రభుఁడ' ననునిశ్చయాగ్నిచేఁ బ్రజ్వలింపఁ
జేయు మజ్ఞానగహనంబు శీఘ్రముగను
శోకముల నెల్లఁ బోఁద్రోలి సుఖివి గమ్ము. ౯

యత్ర విశ్వమిదం భాతి కల్పితం రజ్జుసర్పవత్,
ఆనందః పరమానందః స బోధ స్త్వం సుఖం చర. ౧౦

సత్య మగురజ్జువున నసత్య మగుసర్పము కాననైనట్లే సత్య మగుబ్రహ్మమున నసత్య మగువిశ్వము కాననగును. ఆబ్రహ్మము నీవే యని గ్రహించి సుఖింపుము.

ముక్తాభిమానీ ముక్తో హి బద్ధో బద్ధాభిమాన్యపి,
కింవదంతీహ సత్యేయం 'యా మతిః సా గతిర్భవేత్'. ౧౧

ముక్తాభిమాని ముక్తుఁడే యగును. బద్ధాభిమాని బద్ధుఁడే యగును. 'యా మతిః సా గతిః' అను పెద్దలవాక్యము సత్యమే.

ఆత్మా సాక్షీ విభుః పూర్ణ ఏకో ముక్తశ్చిదక్రియః,
అసంగో నిస్పృహ శ్శాంతో భ్రమాత్ సంసారవానివ. ౧౨

ఆత్మయే సాక్షి, విభుఁడు, పూర్ణుఁడు, ఒక్కరుఁడు, ముక్తుఁడు, చిత్తు, అక్రియుఁడు, అసంగి, నిస్పృహుఁడు, శాంతుఁడు. కాని, భ్రమచే సంసారిగాఁ గనఁబడును.

కూటస్థం బోధమద్వైతమాత్మానం పరిభావయ,
ఆభాసోఽహం భ్రమం ముక్త్వా భావం బాహ్యమథాంతరమ్.

ఆత్మయే కూటస్థము, బోధము, అద్వైత మని భావింపుము. అహంకారభ్రాంతి, బాహ్యాభ్యంతరభావవికృతులు విడిచిపెట్టుము.

దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసి పుత్రక,
బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నిఃకృత్య సుఖీ భవ. ౧౪

దేహాభిమాన మనుత్రాళ్లచేఁ జిరకాలమునుండి బంధింపఁబడితివి. పుత్త్రకా! 'నేనే బోధము' ననుజ్ఞానఖడ్గమున వానిఁ గోసివేసి సుఖింపుము.

నిస్సంగో నిష్క్రియోఽసి త్వం స్వప్రకాశో నిరంజనః,
అయమేవ హి తే బంధః సమాధిమనుతిష్ఠసి. ౧౫

గీ. రజ్జువునఁ గల్గుసర్పవిభ్రాంతిరీతి,
బోధమందు జగద్భ్రాంతి పొడము నంతె
ఆప్రబోధమహానంద మరయ నీవె
యని గ్రహించి గడింపు మహాసుఖంబు. ౧౦

గీ. అగును ముక్తాభిమాని ముక్తాంతరాత్ముఁ
డరయ బద్ధాభిమాని బద్ధాంతరంగుఁ
డెట్టిమతి గల్గునాతని కట్టిగతియె
కల్గు ననుమాటయం దెన్నఁ గలదు నిజము. ౧౧

గీ. ఆత్ముఁడే సాక్షి ప్రభుఁడు నత్యంతశాంతుఁ
డరయఁ బూర్ణుఁ డసంగుఁ డొక్కరుఁడు సుఖియు
నిస్పృహుఁడు చిత్తు నక్రియ నిర్మలుండు
గాని, భ్రాంతి సంసారిగాఁ గాననగును. ౧౨

గీ. నేనహంకార మనుభ్రాంతి నిస్తరించి
విడువు మంతర్బహిర్భావవిభ్రమములు
నేను కూటస్థుఁడను బోధనిధిని మఱియు
నద్వయుఁడఁ బరమాత్ముఁడనని తలంపు. ౧౩

గీ. స్వార్థదేహాభిమానపాశములఁ బుత్ర
చిరమునుండియు బంధవశీకృతుఁడవు
'నేనె జ్ఞానము' ననెడిసునిశితఖడ్గ
హతిని వానిని ద్రెంపి సౌఖ్యమున మనుము. ౧౪

గీ. నీవు నిస్సంగి వగుదువు నిష్క్రియుఁడవు
స్వప్రకాశనిరంజనస్వామి వీవు

నీ వసంగివి. అక్రియుండవు. స్వప్రకాశివి. నిరంజనుండవు. ఇదిమఱచి నీవు కోరుసమాధియే నీబంధమునకుఁ గారణము.

త్వయా వ్యాప్తమిదం విశ్వం త్వయి ప్రోతం యథార్థతః,
శుద్ధబుద్ధస్వరూపస్త్వం మా గమః క్షుద్రచిత్తతామ్. ౧౬

ప్రపంచమంతయు నీవిస్తరణమే. ఇది నీలో నిమిడియే యున్నది. నీవు శుద్ధబుద్ధస్వరూపుఁడవు. క్షుద్రచిత్తము విడనాడుము.

నిరపేక్షో నిర్వికారో నిర్భరః శీతలాశయః,
అగాధబుద్ధిరక్షుబ్ధో భవ చిన్మాత్రవాసనః. ౧౭

నీవు నిరపేక్షివి. నిర్వికారివి. నిర్భరుఁడవు. సదాశయుండవు. అక్షుబ్ధము నగాధము నగుబుద్ధిమంతుఁడవు. చిత్సుఖమే కోరుము.

సాకారమనృతం విద్ధి నిరాకారంతు నిశ్చలమ్,
ఏతత్తత్త్వోపదేశేన న పునర్భవసంభవః. ౧౮

ఆకారము గల దేదైన నసత్యమే యనియు, ఆకారము లేనిదే నిశ్చలమనియు గ్రహింపుము. ఈతత్త్వజ్ఞతవలన నిఁక జన్మరాహిత్య మగును.

యథైవాదర్శమధ్యస్థే రూపేఽంతః పరితస్తు సః,
తథైవాస్మిఞ్ శరీరేఽంతః పరితః పరమేశ్వరః. ౧౯

అద్దమునఁ గలుగుప్రతిబింబమునకు లోపలను బైనను నద్దము కాన నగునట్లే పరమేశ్వరుఁడు నీదేహబహిరంతరములఁ గలఁడు.

ఏకం సర్వగతం వ్యోమ బహిరంతర్యథా ఘటే,
నిత్యం నిరంతరం బ్రహ్మ సర్వభూతగణే తథా. ౨౦

కుండలోఁ జూచినయాకాశము బయటఁ జూచునాకాశము రెండు నొకటైనట్లే యేకము ననంతము నగుబ్రహ్మ మెల్లభూతములలోఁ గలదు.

---

ఇది యెఱుంగకయె నేల వలతు
వడియ నిజమైనబంధన మగును నీకు. ౧౫

గీ. విశ్వమంతయు భవదీయవిస్తరణము
ఇమిడియున్నది నీలోన నీజగంబు
శుద్ధబుద్ధస్వరూపసంశుద్ధుఁ డీవు
క్షుద్రచిత్తము వీడి విజ్ఞుఁడవు గమ్ము. ౧౬

గీ. నిర్వికారివి నిరపేక్షనిర్భరుఁడవు
శీతలాశయసహిత! నీచిత్త మెన్న
క్షుబ్ధరహిత మగాధము సూక్ష్మబుద్ధి
కాంక్షచేయు చిన్మాత్రసౌఖ్యంబుకొఱకు. ౧౭

గీ. ఏది సాకారమో యది యెల్ల సశమె
యొది నిరాకారమో యది యెల్ల నిశ్చ
లమ్ముగాఁ గ్రహింపుము వితర్కమ్ము విడిచి
యీతపోపదేశము జన్మ మీయ దింక. ౧౮

గీ. దర్పణంబునఁ బొడము నీదైనబింబ
మునకు నడుగునఁ బైనను గనుదువద్ద
మటులె భవదీయ మహాదేహమందు దేవుఁ
డలరు బహిరంతరంబుల నరసి చూడ. ౧౯

గీ. ఘటములోపల బయట నొక్కటియె సర్వ
గత మయినవ్యోమ మప్రతర్కంబుగాఁగ
నలరురీతిని నిత్య మనంత మైన
బ్రహ్మమే సర్వభూతంబులందు నలరు. ౨౦

---

# అష్టావక్రసంహితా

## ద్వితీయోఽధ్యాయః

---

### ఆత్మానుభవోల్లాస ప్రకరణమ్

జనక ఉవాచ:—

అహో నిరంజనః శాంతో బోధోఽహం ప్రకృతేః పరః,
ఏతావంతమహం కాలం మోహేనైవ విడంబితః. ౧

ఆహా! నేను నిరంజనుఁడను. శాంతుఁడను. బోధమూర్తిని. ప్రకృతికిఁ బరుఁడను. ఇంతకాలము మోహముచే నేను మోసపోతిని.

యథా ప్రకాశయామ్యేకో దేహమేనం తథా జగత్,
అతో మమ జగత్సర్వమథవా న చ కించన. ౨

ఒక్కఁడ నగు నేనే యీదేహము ప్రకాశింపఁజేయుచున్నాను. అట్లే జగత్తును బ్రకాశింపఁజేయుచుందును. కాన జగ మంతయుం నాదే. లేనిచో నా కేదియును లేదు.

సశరీరమహో విశ్వం పరిత్యజ్య మయాధునా,
కుతశ్చిత్ కౌశలాదేవ పరమాత్మా విలోక్యతే. 3

ఈశరీరము ఈప్రపంచము కూడ విడిచినవాఁడనై గురుకృపవలని కౌశలమునఁ బరమాత్మఁ గనుచున్నాను.

యథా న తోయతో భిన్నాస్తరంగాః ఫేనబుద్బుదాః,
ఆత్మనో న తథా భిన్నం విశ్వమాత్మవినిర్గతమ్. ౪

# అష్టావక్రసంహిత

## ద్వితీయాధ్యాయము

---

### ఆత్మానుభవోల్లాస ప్రకరణము

జనకుఁడు:—

గీ. నే నిరంజనుఁడను శాంతనిశ్చలుఁడను
ప్రకృతికిఁ బరుఁడ బోధభావంబు నేనె
యింతవఱకును నాదుదుష్కృతము వలన
మోహసంవేష్టితుండనై మోసపోతి. ౧

గీ. ఏ నొకండనె యీదేహ ముజ్జ్వలముగఁ
జేయునట్టులె విశ్వంబుఁ జేయుచుందు
నందుచే సర్వజగము నే నగుదుఁగాని
నాఁడు జగమును లేదు నున్నదియు లేదు. ౨

గీ. ఈక్షణమ్మున సశరీర మీప్రపంచ
మెల్ల విడనాడి గురుదేవుకృప జనించు
కౌశలమ్మునఁ బరమాత్ముఁ గాంచఁగల్గి
యవ్యయానందసుఖము నే ననుభవింతు. 3

గీ. ఫేనబుద్బుదవీచికల్ భిన్న మగునె
తోయములనుండి? యట్టులు తోఁచుఁ గాని

అలలు, నురుగు, బుడగలు నీటినుండి వేఱయినవి కానట్లే ప్రపంచము కూడ నట్లే యాత్మనుండి వేఱైనది కాదు.

తంతుమాత్రో భవేదేవ పటో యద్వద్విచారితః,
ఆత్మతన్మాత్రమేవేదం తద్వద్విశ్వం విచారితమ్. ౫

వస్త్రము విమర్శించి చూడఁ దంతుమాత్రమైనట్లే ప్రపంచముకూడ నాత్మతన్మాత్రమే కాని యన్యము కాదు.

యథైవేక్షురసే క్లృప్తా తేన వ్యాప్తైవ శర్కరా,
తథా విశ్వం మయి క్లృప్తం మయా వ్యాప్తం నిరంతరమ్. ౬

చెఱుకురసమునఁ జేయఁబడుచక్కెరలోఁ జెఱుకురసము వ్యాపించి యుండునట్లే నానుండి బయలువెడలినవిశ్వమున నేనే సదా వ్యాపించి యుందును.

ఆత్మజ్ఞానాజ్జగద్భాతి ఆత్మజ్ఞానాన్న భాసతే,
రజ్జ్వజ్ఞానాదహిర్భాతి తజ్జ్ఞానాద్భాసతే న హి. ౭

ఆత్మజ్ఞానము లేనిచో జగ మున్నది. ఆత్మజ్ఞానము గలవారికి జగమే లేదు. రజ్జు వని తెలియనివానికిఁ బాము గలదు. తెలిసినవానికి లేదు.

ప్రకాశో మే నిజం రూపం నాతిరిక్తోఽస్మ్యహం తతః,
యదా ప్రకాశతే విశ్వం తదాహం భాస ఏవ హి. ౮

ప్రకాశమే నానిజరూపము. అంతకు వేఱు కాదు. విశ్వము ప్రకాశించునపుడా ప్రకాశించునది నేనే యగుదును.

అహో వికల్పితం విశ్వమజ్ఞానాన్మయి భాసతే,
రూప్యం శుక్తౌ ఫణీ రజ్జౌ వారి సూర్యకరే యథా. ౯

నాయందు విశ్వ మజ్ఞానముచే గోచరించును. శుక్తియందు రూప్యము, రజ్జువునఁ బాము, సూర్యకిరణమున నీరు నట్లే గోచరించుఁగదా!

యాత్మ విశ్వంబు భిన్నంబు లగునె చూడ
విశ్వ మాత్మవినిర్గతవిషయ మగుట. ౪

గీ. మనము ధరియించువస్త్రవిమర్శనమునఁ
దంతుమాత్రమె యగును వస్త్రమ్ము తాన
నిట్టి విధముననే జగత్సృష్టి యెల్ల
నాత్మతన్మాత్రమే యగు నరసి చూడఁ. ౫

గీ. చెఱకురసమునఁ జక్కెర చేయఁబడుట
నందు వ్యాపించియే యుండునట్లు గాఁగ
నేను సృష్టించుజగమున నేనె సతము
వ్యాప్తమును జెందుచుందు నవ్వారిగాఁగ. ౬

గీ. రజ్జువే భ్రాంతివలన సర్పముగఁ దోఁచు
రజ్జువుగ దానిఁ దెలియ సర్పమ్ము లేదు
అటులె జగమును దోఁచు నాత్మవిద్య
లేని యప్పుడు; కలయప్డు లేదు జగము. ౭

గీ. నాదునిజరూపమే దివ్య దీధితి యగు
నంతకంటె వే ఱొండు గా నరయ నేను
ఎపుడు జగము ప్రకాశించు నపుడు చూడ
నాప్రకాశించు నది నేనె యగుదు నిజము. ౮

గీ. శుక్తమున రూప్యమును వారి సూర్యకిరణ
మునను, రజ్జువు నందున భుజగభయము
భాసమానము లగునట్లు భాసమాన
మగును విశ్వము నజ్ఞాన మగుమనమున. ౯

మత్తో వినిర్గతం విశ్వం మయ్యేవ లయమేష్యతి,
మృది కుంభో జలే వీచిః కనకే కటకం యథా. ౧౦

కుండ మట్టిలోను, అల నీటిలోను, కటకము కనకములోను లయమగు నట్లే; నానుండి బయలువెడలినవిశ్వము నాయందే లయమగును.

అహో అహం నమో మహ్యం వినాశో యస్య నాస్తి మే,
బ్రహ్మాది స్తంబపర్యంతం జగన్నాశోఽపి తిష్ఠతః. ౧౧

అహా! నాకు నేనే నమస్కరింతును. నాకు వినాశమే లేదు. బ్రహ్మాది పిపీలికాంతము జగము నశించినను నే నుందును.

అహో అహం నమో మహ్యమేకోఽహం దేహవానపి,
క్వచిన్న గంతా నాగంతా వ్యాప్య విశ్వమవస్థితః. ౧౨

నే నెంతవాఁడను! నాకు నేనే నమస్కరింతును. దేహ మున్న నొక్కఁడనే. నే నెచటనుండి వచ్చినవాఁడఁ గాను. ఎటకుఁ బోను. నేను విశ్వవ్యాపిని.

అహో అహం నమో మహ్యం దక్షో నాస్తీహ మత్సమః,
అసంస్పృశ్య శరీరేణ యేన విశ్వం చిరం ధృతమ్. ౧౩

అహా! నే నెంతవాఁడను! నాకు నేనే నమస్కరింతును. నాకుఁ జాలినదక్షుఁడే లేఁడు. నాకు శరీరసంస్పృశ్యమే లేదు. ఈవిశ్వమును నేనే సదా భరింతును.

అహో అహం నమో మహ్యం యస్య మే నాస్తి కించన,
అథవా యస్య మే సర్వం యద్వాఙ్మనసగోచరమ్. ౧౪

అహా! నే నెంతవాఁడను! నాకు నేనే నమస్కరింతును. లేదనుకొన్న నే నేమియు లేనివాఁడను. కలదన్న వాఙ్మనసగోచర మగున దెల్ల నాదే.

జ్ఞానం జ్ఞేయం తథా జ్ఞాతా త్రితయం నాస్తి వాస్తవః,
అజ్ఞానాద్భాతి యత్రేదం సోఽహమస్మి నిరంజనః. ౧౫

గీ. మట్టిలోఁ గుండ లయమగు నట్టి రీతి
నంబునిధిలో నలల్ లయమగు విధమున
గటకము సువర్ణ మందున గలియునట్లు
మద్వినిర్గతవిశ్వము మఱఁగు నాలో. ౧౦

గీ. బ్రహ్మ యాదిగా స్తంబపర్యంతసకల
విశ్వనాశనభీకరవేళ నైన
నాశ మెఱుఁగను నే నహో నాకు నేన
తనివితీఱఁగఁ జేతు వందనశతంబు. ౧౧

గీ. దేహ నయ్యు నొకండనై తేజరిలుదు
నెచ్చట జనింప లే దెట కేఁగువాఁడఁ
గాను విశ్వంబునను వ్యాప్తిఁ గనినవాఁడ
నే నహో! నాకు వందన మేన చేతు. ౧౨

గీ. దేహసంస్పర్శమే లేక త్రిభువనములఁ
బరమరక్షణదక్షతఁ బడసినాఁడ
మత్సముం డగుదక్షుండు మహిని లేఁడు
నే నహో! నాకుఁ వందన మేన చేతు. ౧౩

గీ. లేని యప్పుడు నే నేమి లేనివాఁడఁ
గల్గునపుడు వా జ్ఞానసక్రమము లెల్ల
పలుకు సర్వముఁ గలవాఁడ బ్రహ్మ మేను
నే నహో! నాకు వందన మేన చేతు. ౧౪

గీ. జ్ఞాన మన జ్ఞేయ మనఁగను జ్ఞాత యనఁగ
వాస్తవంబుగఁ ద్రివిధంబు నాస్తి చూడ

జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత అనుమూఁడు నిజముగా లేవు. ఇవి అజ్ఞానమునఁ గానఁబడును. నేను నిరంజనుఁడను. ఆ మూఁడింటిరూపము నేనే.

ద్వైతమూలమహో దుఃఖం నాన్యత్తస్యాస్తి భేషజమ్,
దృశ్యమేతన్మృషా సర్వం ఏకోఽహం చిద్రసోఽమలః. ౧౬

ద్వైతమే దుఃఖమూలము. దానికి మందు 'కనఁబడున దెల్లమిథ్య. నే నొక్కఁడను. చిద్రూపుఁడను. అమలుఁడ' ననుస్థిరచిత్తమే.

బోధమాత్రోఽహమజ్ఞానాదుపాధిః కల్పితో మయా,
ఏవం విమృశతో నిత్యం నిర్వికల్పే స్థితిర్మమ. ౧౭

నేను బోధమాత్రుఁడను. అజ్ఞానముచే నుపాధి కల్పింపఁబడినది. నిత్యమిది విమర్శింపఁగా నిర్వికల్పస్థితి నందుచుందును.

న మే బంధోఽస్తి మోక్షో వా భ్రాంతిః శాంతా నిరాశ్రయా,
అహో మయి స్థితం విశ్వం వస్తుతో న మయి స్థితమ్. ౧౮

నాకు బంధము కాని మోక్షము కాని లేదు. భ్రాంతి శాంతమై నిరాశ్రయమైనది. అహో! విశ్వము నాయం దున్నప్పటికి వాస్తవమునకు విశ్వమే లేదు.

సశరీరమిదం విశ్వం న కించిదితి నిశ్చితమ్,
శుద్ధచిన్మాత్ర ఆత్మా చ తత్కస్మిన్ కల్పనాధునా. ౧౯

ఈశరీరము-ఈవిశ్వము-ఏమియుం గా దని నిశ్చయించి యాత్మ శుద్ధచిన్మాత్ర మని గ్రహించినపిమ్మట నింకఁ గల్పనమే లేదు.

శరీరం స్వర్గనరకౌ బంధమోక్షౌ భయం తథా,
కల్పనామాత్రమేవైతత్ కిం మే కార్యం చిదాత్మనః. ౨౦

దేహము స్వర్గనరకములు, బంధమోక్షములు, భయము నన్నియుం గల్పనామాత్రములు. చిదాత్ముఁ డైనవానికి వీనితోఁ బనిలేదు.

జ్ఞానహీనతఁ ద్రికముగాఁ గాననగును
నే నిరంజనుఁడను మూఁడు నేనె యగుదు. ౧౫

గీ. ద్వైతమే దుఃఖమూలము దాని మందు
"దృశ్యమానము నగునది మృష సమస్త
మొక్కరుఁడ నేను శుద్ధుఁడ నుజ్జ్వలుండఁ
జిత్స్వరూపుఁడ" ననుస్థిరచిత్తమగును. ౧౬

గీ. బోధమాత్రుఁడ నగుదు నే బుద్ధిఁ దలఁప
నాయుపాధియు జ్ఞానహీనత జనించె
నిది విమర్శింపఁగా నిత్య మేను పరమ
నిర్వికల్పస్థితిం జెంది నెగడుచుందు. ౧౭

గీ. నాకు మోక్షము లేదు బంధమును లేదు
భ్రాంతి కిటఁ దావు లేనికారణముచేత
శాంతభావముఁ దాల్చె; మజ్జనితవిశ్వ
మస్థితంబును నిజముగా నన్మృతము నగు. ౧౮

గీ. ఈప్రపంచము సశరీర మెల్ల మిథ్య
శుద్ధచిన్మాత్రమే యాత్మశోధనమునఁ
దెలియనగు నింకఁ గల్పన దేనిమీఁద
సాధ్య మగునో యెఱుంగ నసాధ్యముకద! ౧౯

గీ. స్వర్గనరకంబులును దేహబంధమోక్ష
ములును భయమును నిట్టివి మొదలుగాఁగ
నన్నియును గల్పనంబులే యగును వీని
యందుఁ గార్యంబు గలదె? చిదాత్మునకును. ౨౦

అహో జనసమూహేఽపి న ద్వైతం పశ్యతో మమ,
అరణ్యమివ సంవృత్తం క్వ రతిం కరవాణ్యహమ్. ౨౧

అహా! జనసమూహమునఁ గూడ నాకు ద్వైతము కానఁబడుట లేదు. అది యరణ్యముగాఁ దోఁచుచున్నది. నాకు దానియందు రతియే లేదు.

నాహం దేహో న మే దేహో జీవో నాహ మహం హి చిత్,
అయమేవ హి మే బంధ ఆసీత్ యా జీవితే స్పృహా. ౨౨

నేను శరీరము కాను. ఇది నాది కాదు. నేను జీవుఁడను గాను. చిత్స్వరూపుఁడను. జీవితస్పృహ యుండుటే నాకు బాధ మగుచున్నది.

అహో భువనకల్లోలైర్విచిత్రైర్ద్రాక్ సముత్థితమ్,
మయ్యనంతమహాంభోధౌ చిత్తవాతే సముద్యతే. ౨౩

నేననంతసాగరమునుండి చిత్తమను వాయువు బయలువెడలుటచే వివిధతరంగప్రపంచములు వెంటనే యుత్పత్తియగుచున్నవి.

మయ్యనంతమహాంభోధౌ చిత్తవాతే ప్రశామ్యతి,
అభాగ్యాజ్జీవవణిజో జగత్పోతో వినశ్వరః. ౨౪

నేననంతసాగరమున చిత్తవాతము ప్రశాంతి గనుటతోడనే భాగ్యహీనుఁ డగుజీవవణిజుఁడు జగత్తనెడియోడలో నశించుచున్నాఁడు.

మయ్యనంతమహాంభోధావాశ్చర్యం జీవవీచయః,
ఉద్యంతి ఘ్నంతి ఖేలంతి ప్రవిశంతి స్వభావతః. ౨౫

నేననంతసాగరమున నాశ్చర్యముగా జీవతరంగములుపుట్టి, యొండొంటిఁగొట్టుకొని క్రీడించి స్వభావముచే శాంతించుచున్నవి.

---

గీ. ద్వైత మది యెచ్చటను గానఁబడదు నాకు
జనసమూహమునైతము గన నరణ్య
మనఁగఁ దోఁచును దేనియందునను నాకు
నెట్టిరీతి? యెట్టి కార్య? మిఁ కెట్టిఫలము? ౨౧

గీ. ఈశరీరము నేను గా; నిదియు నాది
కాదు; నేను జీవుండను గాను; నిజము
చిత్స్వరూపుఁడ; జీవితస్పృహయె నాకు
బంధమై యున్న దింతకు భరముగాఁగ. ౨౨

గీ. చిత్త మనువాతముననుండి చెప్పరాని
భువనకల్లోల వైచిత్ర్య బుద్బుదములు
నే నను ననంత భీకర నీరధిని జ
నించుచున్నవి వెనువెంట నిశ్చయముగ. ౨౩

గీ. చిత్తవాతమహోద్ధతి చిత్రముగను
నే నను మహాంబుధిని శాంతనిరతిఁ గనుట
భాగ్యహీన జగత్పోత భావజీవ
వణిజుఁ డందునఁ బడి మృత్యువాతఁ జొచ్చు. ౨౪

గీ. నే నను ననంతరమ్యవార్నిధిని జీవ
వీచిక లనంతములు సంభవించి పిదప
నైజగుణమునఁ బోరి విజ్ఞాన మొప్పఁ
గూడి యాడి నశించు మిక్కుటముగాఁగ. ౨౫

# అష్టావక్రసంహితా

## తృతీయోఽధ్యాయః

### ప్రత్యాక్షేపద్వారోపదేశప్రకరణమ్

అష్టావక్ర ఉవాచ:—

**అవినాశినమాత్మానమేకం విజ్ఞాయ తత్త్వతః,**
**తవాత్మజ్ఞస్య ధీరస్య కథ మర్థార్జనే రతిః. ౧**

ఆత్మ నాశము లేని దనియుం ఏక మనియుం దెలిసికొని తత్త్వజ్ఞుం డవై ధీరుండ వైననీ వింక ధనార్జనమున రతి చూపలేవు.

**ఆత్మాజ్ఞానాదహో ప్రీతిర్విషయభ్రమగోచరే,**
**శుక్తేరజ్ఞానతో లోభో యథా రజతవిభ్రమే. ౨**

అజ్ఞానలోభములచే శుక్తిని రజతముగాం గాననైనట్లే, ప్రీతివలన విషయవిభ్రమముకూడ నజ్ఞానముచేం గాననగును.

**విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే,**
**సోఽహ మస్మీతి విజ్ఞాయ కిం దీన ఇవ ధావసి. 3**

విశ్వము సాగరమందలి తరంగజాలమువలె దేనియందుం గనంబడునో యది నీ వని యెఱింగియు నేల దీనుండవై పరిభ్రమింతువు?

**శ్రుత్వాపి శుద్ధచైతన్యమాత్మానమతిసుందరమ్,**
**ఉపస్థేఽత్యంతసంసక్తో మాలిన్యమధిగచ్ఛతి. ౪**

ఆత్మ శుద్ధచైతన్య మని యత్యంతసుందర మని విని కూడ నరుం డుపస్థాదుల నత్యంతసంసక్తుండై మలినుం డెట్లగునో కదా!

# అష్టావక్రసంహిత

## తృతీయాధ్యాయము

---

### ప్రత్యాక్షేపద్వారోపదేశ ప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. ఆత్మ యవినాశి యొక్కటి యని యెఱింగి
యాత్మతత్త్వజ్ఞుఁడవును నీ వని గ్రహించి
ధైర్యవంతుఁడ వయ్యు నర్థార్జనమున
నెట్లు తమకంబుఁ జూపుదు వింక నీవు ? ౧

గీ. ఘనతరాజ్ఞానలోభసంకలన మెట్లు
రమ్యశుక్తిమ రజతవిభ్రాంతిఁ గొల్పు
విషయ విభ్రమ గోచర ప్రీతికూడ
జ్ఞానహీనతచేతనే కానగును. ౨

గీ. సాగరంబునఁ గల్గు వీచీ గణమ్ముఁ
బోలి విశ్వము తోఁపఁ బ్రస్ఫుటముగాను
సాగరంబును నీ వనుజ్ఞాని వయ్యు
నేల దీనుఁడవై వసియింప నీకు ? 3

గీ. శుద్ధచైతన్య మత్యంతసుందరంబు
నాత్మ యని వినియును నరుం డనవరతము
నెట్లు సంసక్తుఁ డగు నుపస్థేంద్రియముల
నెట్లు మాలిన్యసంసర్గ మెలమిఁ దాల్చు. ౪

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
మునే ర్జానత ఆశ్చర్యం మమత్వమనువర్తతే. ౫

సర్వభూతములయం దాత్మయం సర్వ మాత్మయందును గాంచుముని వరుఁడుకూడ నాహా! మమత్వమగ్నుఁ డగుచున్నాఁడుగదా!

ఆస్థితః పరమాద్వైతం మోక్షార్థేఽపి వ్యవస్థితః,
ఆశ్చర్యం కామవశగో వికలః కేలిశిక్షయా. ౬

పరమ మగునద్వైతభావము గలిగియు మోక్షాసక్తి యుండియు నాహా! నరుఁడు చిరాభ్యాసమునఁ గామవశత వికలుఁడై పోవునుగదా!

ఉద్భూతం జ్ఞానదుర్మి(త్ర)మవధార్యాతిదుర్బలః,
ఆశ్చర్యం కామమాకాంక్షేత్ కాలమంతమనుశ్రితః. ౭

జ్ఞానమునకుఁ బరమవిరోధి యని యెఱిఁగియు దుర్బలుఁ డగునరుఁడు మరణకాలమునసైతము కామాంధుఁ డగుఁగదా!

ఇహాముత్ర విరక్తస్య నిత్యానిత్యవివేకినః,
ఆశ్చర్యం మోక్షకామస్య మోక్షాదేవ విభీషికా. ౮

ఇహపరసౌఖ్యముల విరక్తుఁడై నిత్యానిత్యవస్తువివేకము గల్గియు నాహా! మోక్షకామికూడ మోక్ష మన్న భయపడుచుండును!

ధీరస్తు భోజ్యమానోఽపి పీడ్యమానోఽపి సర్వదా,
ఆత్మానం కేవలం పశ్యన్ న తుష్యతి న కుప్యతి. ౯

ధీరుఁడు కష్టసుఖములయందు నిత్యము కేవల మాత్మనే కనుచు దుఃఖము కాని, ఆనందము కాని పొందఁడు.

చేష్టమానం శరీరం స్వం పశ్యత్యన్యశరీరవత్,
సంస్తవే చాపి నిందాయాం కథం క్షుభ్యేత్ మహాశయః.

గీ. సర్వభూతంబు లం దాత్మ సర్వ మాత్మ
యందుఁ గనఁ జాలు మునివరుం డైనఁ గాని
మమతఁ గూడినబుద్ధినిర్మగ్నుఁ డగుట
యద్భుతంబుగఁ జూపట్టు ననవరతము. ౫

గీ. ప్రవిమలాద్వైతభావము ప్రబలియుండ
మోక్షపరమావధియు మనమ్మున వెలుఁగ
నద్భుతం బది మనుజుఁ డహర్నిశంబుఁ
గామవశుఁడై వికృతకేళిఁ గడపఁ దొడఁగు. ౬

గీ. ప్రబలశత్రువు జ్ఞానభాస్వంతున కని
యొఱఁగి వృద్ధయి చిక్కి జీర్ణించి కూడఁ
గామభూతావృతుం డగు నేమి చెప్ప
నచ్చెరువు గొల్పుఁ గద మానవాభిరుచులు. ౭

గీ. ఇహపరాపేక్షసంపర్కరహితుఁ డయ్యు
నిత్యతా ఽనిత్యతాజ్ఞాన నియతిఁ గల్గి
ముక్తి కాంక్షించియును జూడ మోక్ష మనిన
భయపడు నరుండు ఆశ్చర్య భరిత మిదియ. ౮

గీ. ధీరుఁ డగు మానవుం డెట్టి తెఱఁగునైనఁ
బంచభక్ష్యాన్నలబ్ధి సంబరముపడఁడు
ఘోరపీడావృతుం డయి కోపపడఁడు
నిత్య మాత్మాభిదర్శన నియతి వలన. ౯

గీ. తనశరీరమె తనదిగాఁ దలఁప కన్య
దేహచేష్టలఁ జేయ వర్తిల్లునట్టు

చేష్టలు గలతనశరీరము నన్యశరీరముగా భావింపఁగల మహాశయుండు స్తుతినిందల కేల క్షోభపడును?

మాయామాత్రమిదం విశ్వం పశ్యన్ విగతకౌతుకః,
అపి సన్నిహితే మృత్యౌ కథం త్రస్యతి ధీరధీః. ౧౧

విశ్వము మాయామాత్ర మని యెఱిఁగి యందుఁ గుతూహలములేని ధీశాలి మరణము మీఁదపడినను భీతినందఁడు.

నిఃస్పృహం మానసం యస్య నైరాశ్యేఽపి మహాత్మనః,
తస్యాత్మజ్ఞానతృప్తస్య తులనా కేన జాయతే. ౧౨

నైరాశ్యమునఁ గూడ నిస్పృహాబుద్ధి గలమహాత్ముఁడు ఆత్మజ్ఞానతృప్తుఁడగునాతనితోఁ బోల్ప నెవ్వరును లేరు.

స్వభావాదేవ జానానో దృశ్యమేతన్న కించన,
ఇదం గ్రాహ్యమిదం త్యాజ్యం స కిం పశ్యతి ధీరధీః. ౧౩

కానవగువస్తువు తత్త్వతః ఏమియుఁ గాదని యెఱిఁగినధీరధీశాలి ఇది గ్రాహ్యము, ఇది త్యాజ్యము నని యేల తలఁచును?

అంతస్త్యక్తకషాయస్య నిర్ద్వంద్వస్య నిరాశిషః,
యదృచ్ఛయాగతో భోగో న దుఃఖాయ న తుష్టయే. ౧౪

లోకవిషయముల నెల్ల మనస్సున విడిచి, ద్వంద్వరహితుఁడై, కోరికలు లేక యదృచ్ఛాలాభమున జీవించువానికి దుఃఖము తుష్టి యుండవు.

---

లెంచునట్టి మహాశయుఁ డింక నెట్లు
స్తుతికి నిందకు లోనయి క్షోభ మందు ? ౧౦

గీ. విశ్వ మెల్ల మాయామాత్ర విషయ మగుటఁ
గనియుఁ గౌతుకరహితుఁడై క్రాలునట్టి
ధీవరేణ్యుని మృత్యువు తేఱిచూడ
నతఁడు భయపడునే యెన్నఁడైనఁగాని ? ౧౧

గీ. ప్రబల నైరాశ్య వివిధ మార్గముల నైన
నిస్పృహయె గల్గునట్టి మనీషి వర్యుఁ
డాత్మ తత్త్వజ్ఞుఁడై తృప్తి ననుభవింప
వానితోఁ బోల్ప సాటి యెవ్వారు గలరు ? ౧౨

గీ. దృశ్యమానపదార్థ మస్థిర మటంచు
దాని నైజ స్వరూపంబుఁ దగ నెఱుంగు
ధీవరేణ్యుఁడు గనునె సందిగ్ధదృష్టి
నొకటి గ్రాహ్యము త్యాజ్య మింకొకటి యనుచు. ౧౩

గీ. విషయ తృష్ణ సమస్తంబు విడువఁ గలిగి
ద్వంద్వముల దాఁటి కాంక్ష దగ్ధం బొనర్చి
తన నయాచిత లబ్ధ భోగముల నందు
నతని కొక్కటె సుఖదుఃఖవితతి యెల్ల. ౧౪

# అష్టావక్ర సంహితా

## చతుర్థోఽధ్యాయః

---

### ఆత్మజ్ఞానసంకీర్తనప్రకరణమ్

అష్టావక్ర ఉవాచ:—

హంతాత్మజ్ఞస్య ధీరస్య ఖేలతో భోగలీలయా,
న హి సంసారవాహీకై ర్మూఢైః సహ సమానతా. ౧

ఆహా! ఆత్మజ్ఞాని, ధీరుఁడు నగువాఁడు భోగలీలలఁ గ్రీడించుచుం డియుం—సంసారవశుఁడు మూఢుఁడు నగువానితో సాటి కాఁడు.

యత్పదం ప్రేప్సవో దీనాః శక్రాద్యాః సర్వదేవతాః,
అహో తత్ర స్థితో యోగీ న హర్షముపగచ్ఛతి. ౨

ఏపదము వాంఛించి యింద్రాదిసర్వదేవతలు దీను లగుచుందురో యా మహాపదవి నున్నయోగి యెన్నఁడును హర్షము నందఁడు.

తజ్జ్ఞస్య పుణ్యపాపాభ్యాం స్పర్శో హ్యంతర్న జాయతే,
న హ్యాకాశస్య ధూమేన దృశ్యమానాపి సంగతిః. 3

ఆకాశమున ధూమము కానసై దానిని గప్పినట్లు కనఁబడియుం నంట నట్లే జ్ఞానిని బుణ్యాపాపము లంటినట్లు కనఁబడినను నిజముగా నంటవు.

ఆత్మైవేదం జగత్సర్వం జ్ఞాతం యేన మహాత్మనా,
యదృచ్ఛయా వర్తమానం తం నిషేద్ధుం క్షమేత కః. ౪

ఆత్మయే జగత్సర్వ మని యెఱిఁగినమహాత్ముని యదృచ్ఛావర్తనము నెవ్వరు నడ్డగింప లేరు.

# అష్టావక్ర సంహిత

## చతుర్థాధ్యాయము

### ఆత్మానుభవ (ఆత్మజ్ఞాన) సంకీర్తన ప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. ఆత్మవేదియు ధీరుఁడై యలరునతఁడు
భోగలీలలఁ గేళి సల్పుంగు నతఁడు
దురిత సంసార మగ్నులౌ పురుషపశుల
తోడి సామ్యము చూడ నెందునను గనఁడు. ౧

గీ. ఏ మహోన్నత పదము నిచ్ఛించి యింద్రుఁ
డాది యగుదేవతలు దీను లగుచు నుందు
రా మహోన్నత పదవియం దలరు యోగి
యెట్టి హర్షము లందైన మిట్టిపడఁడు. ౨

గీ. వ్యోమపథము కనంబడు ధూమభరిత
మనఁగ నావ్యోమమును ధూమ మంటనట్లు
పుణ్యపాపంబు లన్నవి ముట్టఁజాల
వాత్మవేదిని ముట్టిన యట్లుతోఁచి. 3

గీ. ఆత్మ యన్న జగత్సర్వ మని యెఱుంగు
నేమహాత్ముఁడు వాని యథేచ్ఛమైన
వర్తనంబును వారింప వశమె వనజ
సంభవునకైనఁ గాదు నిస్సంశయంబు. ౪

ఆబ్రహ్మస్తంబపర్యంతే భూతగ్రామే చతుర్విధే,
విజ్ఞస్యైవ హి సామర్థ్య మిచ్ఛానిచ్ఛావివర్జనే. ౫

బ్రహ్మ మొదలు తృణమునఱకుఁ గలనాలుగువిధముల జీవరాసుల లోను ఇచ్ఛానిచ్ఛావివర్జన చేయఁగలవాఁడొక్కవిజ్ఞుఁడే యగును.

ఆత్మానమద్వయం కశ్చిజ్జానాతి జగదీశ్వరం,
యద్వేత్తి తత్ స కురుతే న భయం తస్య కుత్రచిత్. ౬

ఆత్మ యద్వయ మనియుఁ దాను జగదీశ్వరుఁడనియుం నెఱిఁగినవాఁడు తా నెఱిఁగినదే చేయును; ఎందును భయపడఁడు.

---

గీ. బ్రహ్మ యాదిగా స్తంబపర్యంత మైన
నాల్గు విధముల జీవ సంతతులలోన
విజ్ఞుఁ డొక్కండె యజ్ఞుండు విడువఁజాల
నిచ్ఛయు ననిచ్ఛయును దనహృదయమందు. ౫౯

గీ. అద్వయం బెన్నఁ దనయాత్మ యనియుఁ దాను
జగదధీశ్వరుఁ డనెడి విజ్ఞతఁ గలట్టి
వాఁ డరుదు తా నెఱింగినపనియె చేయు
నాతఁ డతనికి భయ మిసుమంత లేదు. ౬౦

---

-

# అష్టావక్రసంహితా

## పంచమోఽధ్యాయః

### లయ చతుష్టయప్రకరణమ్

అష్టావక్ర ఉవాచ:—

న తే సంగోఽస్తి కేనాపి కిం శుద్ధస్త్యక్తుమిచ్ఛసి,
సంఘాతవిలయం కుర్వన్నేవ మేవలయం వ్రజ. ౧

నీకు దేనితోడను సంగ మావంతయుం లేదు. నీవు శుద్ధుఁడవు. ఇఁక నీ వేమి విడుతువు? ఈసంఘాతబుద్ధి నశించిన లయయోగము లభించును.

ఉదేతి భవతో విశ్వం వారిధేరివ బుద్బుదః,
ఇతిజ్ఞాత్వైకమాత్మాన మేవ మేవ లయం వ్రజ. ౨

సముద్రమున బుడగలు కలుగునట్లు నీనుండి విశ్వము పుట్టుచున్నది. ఈవిధముగ నాత్మ యొక్కటే యని గ్రహించియుఁ లయయోగ మందఁగలవు.

ప్రత్యక్షమప్యవస్తుత్వాద్విశ్వం నాస్త్యమలే త్వయి,
రజ్జుసర్ప ఇవ వ్యక్త మేవ మేవ లయం వ్రజ. 3

రజ్జువున నిజముగా లేనిసర్పము కనఁబడినట్లే యమలుఁడ వగు నీయందు నిజముగా లేనివిశ్వము కనఁబడునట్లుండును. ఇట్లును లయమందఁగలవు.

సమదుఃఖసుఖః పూర్ణ ఆశానైరాశ్యయోః సమః,
సమజీవితమృత్యుః సన్నేవ మేవ లయం వ్రజ. ౪

సుఖదుఃఖములయందును ఆశనిరాశలయందును జీవమృత్యువులందును పూర్ణుఁడ వగునీవు సమదర్శనుఁడ వైనను లయయోగ మందఁగలవు.

# అష్టావక్ర సంహిత

## పంచమాధ్యాయము

---

### లయచతుష్టయ ప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. దేనితోఁడను సంగ మింతేని లేని
శుద్ధుఁడవు నీవు విడుచు వస్తువులు గలవె ?
సంగయుక్తుఁడ వనుబుద్ధిఁ గ్రుంగఁజేయు
మప్పు డైనను లయయోగ మందఁగలవు. ౧

గీ. బుద్బుదంబులు నీటిలోఁ బొడము నటులు
విశ్వ మంతయు నీనుండి విస్తరించు
నటులె గ్రహియింపు మాత్మ యొక్కటి యటంచు
నప్పుడైనను లయయోగ మందఁగలవు. ౨

గీ. రజ్జువునఁ దోఁచు సర్ప విభ్రాంతిరీతిఁ
దోఁచు జగము నీయందు భ్రాంతుండ వైన
నిజము పరికింప విశ్వంబు నిలువ దనుట
డెందమున నెంచి లయయోగ మందఁగలవు. ౩

గీ. సర్వసుఖదుఃఖములయందు సముఁడ వగుట
నాసయందును నైరాశ్యమందు నట్లె
జీవమృత్యువు లందును స్థిరసమత్వ
ముందిననునీవు లయయోగ మందఁగలవు. ౪

---

# అష్టావక్రసంహితా

## షష్ఠోఽధ్యాయః



### జ్ఞానచతుష్క ప్రకరణమ్

అష్టావక్ర ఉవాచః—

ఆకాశవదనంతోఽహం ఘటవత్ ప్రాకృతం జగత్,
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః. ౧

ఆకాశమువలెనే నంతము లేనివాఁడను, ప్రాకృతజగత్తు కుండవంటిది. ఇదే జ్ఞానము. కాన, నిది త్యజింపవలసినది గ్రహింపవలసినది లయమగునది కాదు.

మహోదధిరివాహం స ప్రపంచో వీచిసన్నిభః,
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః. ౨

నేను మహాసముద్రమును. విశ్వము అందలి యలలవంటిది. ఇదే జ్ఞానము. కాన నిది త్యాజ్యము గ్రాహ్యము లయము కాదు.

అహం స శుక్తిసంకాశో రూప్యవద్విశ్వకల్పనా,
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః. 3

నేను శుక్తివంటివాఁడను. విశ్వము రూప్యమువంటిది. ఇదే జ్ఞానము. కాన నిది త్యాజ్యము గ్రాహ్యము లయము కాదు.

అహం వా సర్వభూతేషు సర్వభూతాన్యథో మయి,
ఇతి జ్ఞానం తథైతస్య న త్యాగో న గ్రహో లయః. ౪

నేనే సర్వభూతములును సర్వభూతములు నాయం దున్నవి. ఇదే జ్ఞానము. కాన నిది త్యాజ్యము గ్రాహ్యము లయము గాదు.



# అష్టావక్ర సంహిత

## షష్ఠాధ్యాయము

### జ్ఞానచతుష్క ప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. "అంతరిక్షముపగిది ననంతుఁ డేను
ప్రాకృత జగంబు మృత్పాత్రవంటి దనుచుఁ
దెలియుటే జ్ఞాన మగు నింక దీనియందుఁ
ద్యాగము పరిగ్రహంబు లయంబు లేదు. ౧

గీ. "నే మహోదధి" ననుభావ నిశ్చయంబు
"నిఖిలజగమును వీచి సన్నిభ" మటంచుఁ
దెలియుటే జ్ఞాన మగు నింక దీనియందుఁ
ద్యాగము పరిగ్రహంబు లయంబు లేదు ౨

గీ. రమ్య మగు శుక్తివలె నేను రంజిలుదును
విశ్వకల్పన రూప్యంబు విధ మటంచుఁ
దెలియుటే జ్ఞాన మగు నింక దీనియందుఁ
ద్యాగము పరిగ్రహంబు లయంబు లేదు. ౩

గీ. "నేనె సర్వభూతంబులు నిశ్చయముగఁ
బుట్టు నాయందె నిఖిలమహా భూతవితతి"
యని యెఱుంగుటయే జ్ఞాన మగును దీనఁ
ద్యాగము పరిగ్రహంబు లయంబు లేదు. ౪

# అష్టావక్రసంహితా

## సప్తమోఽధ్యాయః

### అనుభవపంచక ప్రకరణమ్

జనక ఉవాచ:—

మయ్యనంతమహాంభోధౌ విశ్వపోత ఇతస్తతః,
భ్రమతి స్వాంతవాతేన నమమా స్త్యసహిష్ణుతా. ౧

నేననునంతసాగరమున విశ్వమనునావ దానిస్వభావ మనుగాలిచే నిటునటు తిరుగుచున్నది. నాకు మాత్ర మశాంతియే లేదు.

మయ్యనంతమహాంభోధౌ జగద్వీచిః స్వభావతః,
ఉదేతు వాస్తమాయాతు న మే వృద్ధిర్న చ క్షతిః. ౨

నేననునంతసాగరమున జగ మనునలలు స్వభావముచే బయలు వెడలుచున్నవి. వాస్తవముగా నాకు వృద్ధి క్షయములు లేవు.

మయ్యనంతమహాంభోధౌ విశ్వం నామ వికల్పనా,
అతిశాంతో నిరాకార ఏతదేవాహమాస్థితః. 3

నేననునంతసాగరమున విశ్వ మనునొకకల్పనము గలదు. నే నతి శాంతుఁడను. నిరాకారుఁడను. ఇందే నే నుండును.

నాత్మా భావేషు నో భావస్తత్రానంతే నిరంజనే,
ఇత్యసక్తోఽస్పృహః శాంత ఏతదేవాహమాస్థితః. ౪

అనంతము నిరంజనము నగునాత్మ యందు భావము, భావమున నీయాత్మ యుం నుండవు. కాన నిది యసక్తము, నస్పృహము, శాంతము ఇందే నే నుందును.

అహో చిన్మాత్రమేవాహమింద్రజాలోపమం జగత్,
అతో మమ కథం కుత్ర హేయోపాదేయ కల్పనా. ౫

ఆహా! నేను చిన్మాత్రుఁడనే. విశ్వ మింద్రజాలమువంటిది. ఇంక నాయందు హేయ మని యుపాదేయ మని కల్పన మెట్లుండును?

# అష్టావక్రసంహిత

## సప్తమాధ్యాయము

అనుభవపంచక ప్రకరణము

జనకుఁడు:—

గీ. నేనను ననంతదివ్యవార్నిధిని సతము
స్వాంతవాతోపహతిని విశ్రాంతి లేక
విశ్వపోతము భ్రమియించు వివిధగతుల
నంతియే కాని యెఱుఁగ నశాంతి నేను. ౧

గీ. నేనను ననంతదివ్యవార్నిధిని సతము
సహజముగ విశ్వవీచికాజాలము లవి
పుట్టి పెరిఁగియు మాయమై పోవుఁ గాని
యెదుగు పొదుగులు లేవు నా కెపుడు వీన. ౨

గీ. నేనను ననంతదివ్యవార్నిధిని గలదు
విశ్వనామ వికల్పనా విషయ మొకటి
పరమశాంత నిరాకారవరుఁడ నగుట
నిందె చరియించుచుందు నానందమునను ౩

గీ. అంతరహిత నిరంజన మైన యాత్మ
యుంచఁబడదు దేహాదికల్పోక్తములను
గనుక సంసర్గ సంస్పృహములఁ గనక నేను
జ్ఞానరూపాత్మనై శాంతినంది యుంటి. ౪

గీ. నేనహో! యెంచఁ జిన్మాత్రమే నిజంబు
నున్న విశ్వ మదింద్రజాలోపమంబు
నగుట నాయందుఁ జూడ నావంతయైన
లేదు నిరసింప గ్రహియింప నాదరంబు. ౫

# అష్టావక్రసంహితా

## అష్టమోఽధ్యాయః

### బంధమోక్షవ్యవస్థా చతుష్కప్రకరణమ్

అష్టావక్ర ఉవాచః—

తదా బంధో యదా చిత్తం కించిద్వాంఛతి శోచతి,
కించిన్ముంచతి గృహ్ణాతి కించిద్ధృష్యతి కుప్యతి. ౧

మనస్సు కొంచెమైనను గోరినను, ఏకొంచెమునకైన దుఃఖించినను ఏ కొంచెమైన సుఖించినను కోపించినను గ్రహించినను త్యజించినను అదియే బంధ మగును.

తదా ముక్తిర్యదా చిత్తం న వాంఛతి న శోచతి,
న ముంచతి న గృహ్ణాతి న హృష్యతి న కుప్యతి. ౨

మనస్సు కోరిక లేక దేనికొఱకు విచారింపక దేనిని గ్రహింపక త్యజింపక దేనివలనను సంతోషదుఃఖములందక నుండుటే ముక్తి.

తదా బంధో యదా చిత్తం సక్తం కాస్వపి దృష్టిషు,
తదా మోక్షో యదా చిత్త మసక్తం సర్వదృష్టిషు. 3

దేనియందు మనస్సు కొంచెమైన సక్తమై యున్నను నదిబంధమే. ఏవిషయముననను మనస్సు సక్తము కాక వెలయుంటే మోక్షము.

యదా నాహం తదా మోక్షో యదాహం బంధనం తదా
మత్వేతి హేలయా కించిత్ మా గృహాణ విముంచ మా.

'నాహ' మున్నచోట మోక్షము అహము గలచో బంధము నగును. ఇది యెఱిఁగి గ్రహించుట త్యజించుట విడువుము.

---

# అష్టావక్ర సంహిత

## అష్టమాధ్యాయము

---

### బంధమోక్షవ్యవస్థా చతుష్క ప్రకరణము

అష్టావక్రుడు:—

గీ. కొంచెమైన వాంఛించినఁ గించపడినఁ
గొంచెమైనఁ ద్యజించినఁ గోరుకొనినఁ
గొంచెమైన సుఖించినఁ గోపపడినఁ
నదియె బంధము ప్రతిబంధ మగు విరతికి. ౧

గీ. కాంక్ష యనునది లేక దుఃఖమును లేక
హేయ మది లేక యాదర మింత లేక
సౌఖ్యనిరతియుఁ గోపభాజనత లేక
మనము వెలయుటయే ముక్తి యనఁగ నొప్పు. ౨

గీ. చిత్త మది చూడ్కులందుఁ జిక్కుకొనినఁ
ప్రబలబంధన ప్రాప్తి కారణమె యగును
చిత్త మది దృష్టులందును జిక్కుకొనక
యుండుటే మోక్ష సుఖమగు నోయి! జనక! ౩

గీ. 'అహము' గలచోట బంధన మలరుచుండు
'నాహ' మనుచోటనే మోక్షణము వెలుంగు
నిది యెఱింగిన పిదప నీ వించుకైన
వలదు గ్రహియింపఁ ద్యజియింప వలదు వలదు. ౪

---

# అష్టావక్ర సంహితా

## నవమోఽధ్యాయః

## నిర్వేదాష్టకప్రకరణమ్

అష్టావక్ర ఉవాచః—

కృతాకృతే చ ద్వంద్వాని కదా శాంతాని కస్య వా,
ఏవం జ్ఞాత్వేహ నిర్వేదాద్భవ త్యాగపరోఽవ్రతీ. ౧

కృతాకృతములు, ద్వంద్వములు నెవని కెప్పుడు శాంతించునో తెలిసి కొని త్యాగపరుఁడవు నవ్రతుఁడవునై నిర్వేదము నందుము.

కస్యాపి తాత ధన్యస్య లోకచేష్టావలోకనాత్,
జీవితేచ్ఛా బుభుక్షా చ బుభుత్సోపశమం గతాః. ౨

లోకమందలిజనులచేష్టలు గాంచినంతనే జీవితముపైఁ గోరిక, సుఖాపేక్ష, జ్ఞానాపేక్ష యెవనికి నశించునో వత్సా! అట్టివాఁ డరుదు. వాఁడే ధన్యుఁడు.

అనిత్యం సర్వమేవేదం తాపత్రితయ దూషితమ్,
అసారం నిందితం హేయమితి నిశ్చిత్య శామ్యతి. 3

సర్వము ననిత్య మని తెలిసికొని సమస్తము తాపత్రయ దూషితముగాఁ గని అసారము, నిందితము, హేయముగా గ్రహించి ధీశాలి శాంతి నందుచున్నాఁడు.

కోఽసౌ కాలో వయః కిం వా యత్ర ద్వంద్వాని నో నృణామ్,
తాన్యుపేక్ష్య యథాప్రాప్త వర్తీ సిద్ధిమవాప్నుయాత్. ౪

# అష్టావక్ర సంహిత

## నవమాధ్యాయము

### నిర్వేదాష్టక ప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. ఎప్పు డెవనికిఁ గృతము నకృతము మఱియు
ద్వంద్వములు కూడఁ బరమశాంతమును గనునో
యటు లెఱింగి నిర్వేదసమాశ్రయమునఁ
ద్యాగపరుఁడవు గమ్ము వ్రతంబుఁబూని. ౧

గీ. లోకమానవచేష్టావలోకనమున
జీవితేచ్ఛ సుఖాపేక్ష చిత్తజనిత
ఘనబుభుక్షయు నేమహాత్మునకుఁ జనునో
వానిఁ గొనియాడ వత్స! యెవ్వనితరంబు? ౨

గీ. నిందితంబును హేయ మనిత్య మెల్ల
సారహీనము నగుట విసర్జనీయ
మెలమిఁ దాపత్రయాది సంకులము పరమ
దూషితం బని జ్ఞాని శాంతుండు నగును. 3

గీ. ఏవయస్సున మఱి యెట్టియెడల నెట్లు
ద్వంద్వములు మానవుని వశపఱచుకొనవు?

ఏకాలమున నేవయస్సున ద్వంద్వములు మానవుని వశపఱచుకొనవు? వీని నుపేక్షించినవాఁడే యదృచ్ఛాలాభమున నుండువాఁడే సిద్ధి నందును.

నానామతం మహర్షీణాం సాధూనాం యోగినాం తథా,
దృష్ట్వా నిర్వేదమాపన్నః కో న శామ్యతి మానవః. ౫

వివిధమతములు గలమహర్షులు సాధువులు యోగులు మున్నగువారి యందుఁ గలభిన్నత్వము నెఱిఁగి నిర్వేదమున శాంతి నందనివాఁ డెట్టివాఁడు?

కృత్వా మూర్తిపరిజ్ఞానం చైతన్యస్య చ కిం గురుః,
నిర్వేదసమతాయుక్త్యా యస్తారయతి సంసృతీ. ౬

చైతన్యస్వరూపపరిజ్ఞానము గలిగి నిర్వేదము సమత్వము నాశ్రయించి సంసారమునుండి తరింపఁజేయువాఁడే నిజమైనగురువు కదా?

పశ్య భూతవికారాం స్త్వం భూతమాత్రాన్ యథార్థతః,
తత్‌క్షణాత్ బంధనిర్ముక్తః స్వరూపస్థో భవిష్యసి. ౭

యథార్థముగా భూతవికారములు లేవనియు భూతమాత్రము లేగల వనియుఁ గాంచినంతనే బంధముక్తుఁడవై స్వరూపస్థితిని సుఖింపఁగలవు.

వాసనా ఏవసంసార ఇతి సర్వా విముంచ తాః,
తత్త్యాగో వాసనాత్యాగాత్ స్థితిరద్య యథా తథా. ౮

వాసనయే (కోరిక) సంసారము. కాన, సర్వము త్యజింపుము. సంసారత్యాగమే వాసనాత్యాగ మగును. అపు డెచ్చట నున్న నుండవచ్చును.

కాన వానిఁ ద్యజించి పుణ్యానుయాయి
సిద్ధి గను యదృచ్ఛాలాభజీవనమున. ౪

గీ. ఘనమునీంద్రులు యోగిపుంగవులు పరమ
సాధుజనులు నానామత చారు లగుటఁ
దెలిసి నిర్వేదమున శాంతిదీప్తిఁ గనని
వాని నెట్లు గణింపఁగా వలయునో శద ! ౫

గీ. సమతచేతను నిర్వేదశక్తిచేత
యుక్తిచేతను జైతన్యశక్తిమూర్తి
ఘనపరిజ్ఞాన మరసి సంఘమును బ్రోచు
దురితసంసారముననుండి గురువరుండు. ౬

గీ. సకలభూత వికార నిజస్థితులను
భూతమాత్రములుగఁ గాంచి పొందఁగలవు
తత్క్షణము బంధనిర్ముక్త ధన్యసుగతి
నీస్వరూపంబు నం దిఁక నెగడఁ గలవు. ౭

గీ. వాసనామాత్ర మాను భవంబు గాన
విడువు మింక సర్వమ్ము వివేకబుద్ధి
భవము విడిచిన వాసన వదలిపోవుఁ
బిదప నెచ్చట నున్న నప్రియము లేదు. ౮

# అష్టావక్రసంహితా

## దశమోఽధ్యాయః.

### ఉపశమాష్టక ప్రకరణమ్

అష్టావక్ర ఉవాచ:—

విహాయ వైరిణం కామమర్థం చానర్థసంకులమ్,
ధర్మమప్యేతయోర్హేతుం సర్వత్రానాదరం కురు. ౧

శత్రువగు కామమును అనర్థసంకుల మగునర్థమును ఈరెండిటికిఁ గారణ మగుధర్మమును విడిచి సర్వత్ర నిరాదరము చూపుము.

స్వప్నేంద్రజాలవత్ పశ్య దినాని త్రీణి పంచ వా,
మిత్రక్షేత్రధనాగారదారాదాయాది సంపదః. ౨

మిత్రక్షేత్రములు, దారదాయాదులు, ధనాగారములు నివి యెల్ల మూఁడునాళ్లముచ్చట లని కలలోనియింద్రజాల మని తిలకింపుము.

యత్ర యత్ర భవేత్తృష్ణా సంసారం విద్ధి తత్ర వై,
ప్రౌఢవైరాగ్యమాశ్రిత్య వీతతృష్ణః సుఖీ భవ. 3

తృష్ణ గలచోట నెల్ల సంసారము గల దని గ్రహింపుము. ప్రౌఢ వైరాగ్య మాశ్రయించిన తృష్ణ వైతొలఁగును. సుఖ ముండుము.

తృష్ణామాత్రాత్మకో బంధస్తన్నాశో మోక్షఉచ్యతే,
భవాసంసక్తిమాత్రేణ ప్రాప్తితుష్టిర్ముహుర్ముహుః. ౪

తృష్ణయే బంధము. తృష్ణానాశనమే మోక్షము. సంసారమం దనసంసక్తియే మహాసంతుష్టి నొసఁగఁగలదు.

# అష్టావక్రసంహిత

## దశమాధ్యాయము

### ఉపశమాష్టక ప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. అర్థకామము లెల్ల ననర్థకార
కములు ధర్మమే వీనికిఁ గారణంబు
ధర్మమును వీడ నిన్నియుఁ దరలిపోవుఁ
దరలిపోవుటయే మోక్షదంబు నీకు. ౧

గీ. దారదాయాదిసంపదర్థంబు లెల్ల
క్షేత్రమిత్రధనాగారకీర్తు లెల్ల
మూఁడునాళ్ల ముచ్చటలయి ముదముగొల్పు
స్వప్నవిలసిత మగు నింద్రజాలమట్లు. ౨

గీ. తృష్ణ విలసిల్లు సర్వప్రదేశములను
గలదు సంసారప్రబలభీకరవిషాహి
ప్రౌఢవైరాగ్య మాశ్రయింపఁగఁ దొలంగు
నఖిలతృష్ణలు నపుడు సౌఖ్యమ్ముమిగులు. ౩

గీ. తృష్ణయే బంధ మగుఁ జూడ దేహమునకు
తృష్ణ నశియించుటే మోక్షదివ్యపదవి
కడునసంసక్తిమాత్రచేఁ గాననగును
ప్రబలసంతుష్టి నిత్యసంప్రభవ మగుచు. ౪

త్వమేకశ్చేతనః శుద్ధో జడం విశ్వమసత్తథా,
అవిద్యాపి న కించిత్సా కా బుభుత్సా కథాపి తే. ౫

నీ వొక్కఁడవు. చేతనుఁడవు. శుద్ధుఁడవు. జగము జడము. అవిద్య సత్యముగ లేదు. అసత్యమే. ఇఁక నీకు కోరిక దేనిమీఁద?

రాజ్యం సుతాః కళత్రాణి శరీరాణి సుఖాని చ
సంసక్తస్యాపి నష్టాని తవ జన్మని జన్మని. ౬

రాజ్యము, సుతులు, భార్యలు, శరీరములు, సుఖములు. ఇవన్నియుఁ వానిపై నీ కెంత సంసక్తి యున్నను అనేకజన్మములలో నశించియే పోయినవి.

అలమర్థేన కామేన సుకృతేనాపి కర్మణా,
ఏభ్యః సంసారకాంతారే న విశ్రాంతమభూన్మనః. ౭

అర్థము, కామము, సుకృతకర్మములు ఈపాటి చాలును. ఇవి గల సంసారారణ్యమున నామన మెప్పుడును విశ్రాంతి గాంచియుండలేదు.

కృతం న కతి జన్మాని కాయేన మనసా గిరా,
దుఃఖమాయాసదం కర్మ తదద్యాప్యుపరమ్యతామ్. ౮

ఎన్నిజన్మములలో నీవు మనోవాక్కాయకర్మములచే దుఃఖాయాసదము లగుకర్మములు చేసియుండలేదు? నేఁడైన వాని వీడి యుపశాంతి నందుము.

గీ. నీ వనఁగ నొక్కరుండవు నిర్మలుఁడవుఁ
జిన్మయుండవు మఱి విమర్శించి చూడ
జగము జడము నవిద్య నశ్వరము గానఁ
గాంక్ష జనియింప లే దిఁకఁ గారణంబు. ౫

గీ. పుత్రమిత్రకళత్రాది భోగములును
రాజ్యసుఖదేహసంపదార్జనము లెల్లఁ
బ్రబలసంసక్తి వానిపై వదలియున్న
జన్మజన్మంబులందు నష్టంబు లాయె. ౬

గీ. చాలుఁ జాలును గామార్థసంపదాళి
సుకృతకర్మంబులకు నింక శుభము శుభము
సారహీనసంసారకాంతారమందు
మనము విశ్రాంతి యెఱుఁగ దేమాత్రమైన. ౭

గీ. దుఃఖదాయాసకర్మసందోహములను
దేహమానసవాక్కులఁ ద్రికరణముల
నెన్నిభవములఁ జేసి జనింపలేదు ?
కనుక నేఁడైన నుపశాంతి గనుము విడిచి. ౮

# అష్టావక్రసంహితా

## ఏకాదశోఽధ్యాయః

---

### జ్ఞానాష్టక ప్రకరణమ్

అష్టావక్ర ఉవాచ:—

భావాభావవికారాశ్చ స్వభావాదితి నిశ్చయీ,
నిర్వికారో గతక్లేశః సుఖేనైవోపశామ్యతి. ౧

భావాభావవికారములు స్వభావసిద్ధము లని నిశ్చయించి నిర్వికారుఁడై దుఃఖములను వీడినతఁడే సుఖమున నుపశాంతి నందును.

ఈశ్వరః సర్వనిర్మాతా నేహాన్య ఇతి నిశ్చయీ,
అంతర్గలితసర్వాశః శాంతః క్వాపి న సజ్జతే. ౨

ఈశ్వరుఁడే సర్వనిర్మాత యనియుఁ నన్యుఁ డెవ్వఁడుఁ గాఁ డని నిశ్చయించినాతఁ డాశ లన్నియుఁ మనమున నే యణఁగ శాంతితో నసంగమున నుండును.

ఆపదః సంపదః కాలే దైవాదేవేతి నిశ్చయీ,
తృప్తః స్వస్థేంద్రియో నిత్యం న వాంఛతి న శోచతి. 3

ఆపదలు సంపదలు కాలమున దైవగతి గల్గు నని నిశ్చయించి నతఁడు నిత్యము తృప్తుఁడు శాంతించినయింద్రియములు గలవాఁడునై యేదియుఁ గోరఁడు. దేనికి విచారింపఁడు.

సుఖదుఃఖే జన్మ మృత్యూ దైవాదేవేతి నిశ్చయీ,
సాధ్యాదర్శీ నిరాయాసః కుర్వన్నపి న లిప్యతే. ౪

# అష్టావక్ర సంహిత

## ఏకాదశాధ్యాయము

### జ్ఞానాష్టక ప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. భావజాభావవికృతుల్ స్వభావసిద్ధ
ము లను దృఢనిశ్చయంబును గలయతండు
నిర్వికారుఁడు నిర్దగ్ధనిఖిల కష్టుఁ
డయి సుఖంబున నుపశాంతి నందుఁ బిదప. ౧

గీ. ఈశ్వరుఁడె సర్వనిర్మాత యింక నతని
సముఁడు లేఁ డను పరమనిశ్చయమువలన
నాశలన్నిటి మదిలోన నణఁచివైచి
సర్వసంగములను వీడ శాంతి గలుగు. ౨

గీ. కష్టసుఖములు దైవసంఘటనవలనఁ
గాలమున వచ్చిపోవు సంగతి యెఱింగి
నిత్యతృప్తియు నింద్రియనియమశక్తి
గలుగ వాంఛయు శోకంబు గలుగ వెపుడు. 3

గీ. సర్వసుఖదుఃఖజాలము జననమరణ
ములును దైవసంఘటనచేఁ గలుగు ననెడి

సుఖదుఃఖములు జననమరణములు దైవగతి గల్గు నని నిశ్చయించిన వాఁడు కావలసినవి గలుగ వని తెలిసి నిరాయాసమున నేపనిఁ జేయుచున్నను నిర్లిప్తుఁ డయియే యుండును.

చింతయా జాయతే దుఃఖం నాన్యథేహేతి నిశ్చయీ,
తయా హీనః సుఖీ శాంతః సర్వత్ర గలితస్పృహః. ౫

చింతవలన దుఃఖము గలుగును. ఇతరములవలనఁ గలుగ దనినిశ్చయించినవాఁ డది విడిచి సుఖమును శాంతుఁడై యన్నిట నిస్పృహుఁడై వెలయును.

నాహం దేహో న మే దేహో బోధోఽహమితి నిశ్చయీ,
కైవల్యమివ సంప్రాప్తో న స్మరత్యకృతం కృతమ్. ౬

నేను దేహము గాను. దేహము నాది కాదు. నేను బోధమునే యని నిశ్చయించినవిజ్ఞుఁడు కైవల్యముఁ సంప్రాప్త మైనను కృతాకృతముల స్మరింపఁడు.

ఆబ్రహ్మస్తంబపర్యంతమహమేవేతి నిశ్చయీ,
నిర్వికల్పః శుచిః శాంతః ప్రాప్తాప్రాప్తవినిర్వృతః. ౭

బ్రహ్మమొదలు తృణముదాఁక నేనే యని నిశ్చయించిన విజ్ఞుఁడు వికల్పము లేనివాఁడు, శుచి శాంతుఁడు ప్రాప్తాప్రాప్తములనుండి నిర్వృతి నందినవాఁడు నగును.

నానాశ్చర్యమిదం విశ్వం న కించిదితి నిశ్చయీ,
నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించిదివ శామ్యతి. ౮

పలువిధములై యాశ్చర్యకర మగువిశ్వ మేమియుఁ గా దని నిశ్చయించిన విజ్ఞుఁడు వాసనాహీనుఁడు, స్ఫూర్తిమాత్రుఁడునై యేదియుఁ లేనట్లు శాంతిగనును.

---

నిశ్చయమ్మున సాధ్యముల్ నిలిచిపోవఁ
జేసి చేయనివాఁ డయి చెందు విరతి. ౪

గీ. చింతయే దుఃఖము నొసంగు నెంతయేని
యితరములు గా వటంచు గ్రహించు నతఁడు
దానిఁద్యజియించి సుఖము శాంతమును గనును
నెల్లయెడల నిష్కామియై యొసక మెసఁగు. ౫

గీ. ఈశరీరము నాది కా దేను దేహి
గాను బోధస్వరూపుఁడఁ గాని యనుచుఁ
బరమవిజ్ఞుఁడు గైవల్యపదవి నందు
నెఱుఁగఁ డెన్నడుఁ గృతము నకృతము నతఁడు. ౬

గీ. బ్రహ్మ యాదిగా స్తంబపర్యంత మెల్ల
నేనె యను నిశ్చయమ్మును నిలుపునతఁడు
నిర్వికల్పశ్శుచిశ్శాంతి నెగడఁ గనుటఁ
బ్రాప్త మప్రాప్తములు వానిఁ బాసి పోవు. ౭

గీ. పలు తెఱంగుల నాశ్చర్యభరిత మైన
జగము కించిత్తుఁ గాదు నిశ్చయ మటంచు
నెఱుఁగఁ గోర్కెలు నశియించు నింకఁ బిదప
స్ఫూర్తిమాత్రుఁడై విశ్రాంతి పొందు నతఁడు. ౮

---

# అష్టావక్రసంహితా

## ద్వాదశోఽధ్యాయః

### ఏవమేవాష్టక ప్రకరణమ్

జనక ఉవాచ:—

కాయకృత్యాసహః పూర్వం తతో వాగ్విస్తరాసహః,
అథ చింతాసహస్తస్మాదేవమేవాహమాస్థితః. ౧

మొదటఁ గాయకర్మములుఁ బిదప వాగ్విస్తరము ననంతరము నాకు చింతయు నసహ్యాము లయ్యెను. ఇటు లంత యథాస్థితి నుందును.

ప్రీత్యభావేన శబ్దాదేరదృశ్యత్వేన చాత్మనః,
విక్షేపైకాగ్రహృదయ ఏవమేవాహమాస్థితః, ౨

శబ్దములయందుఁ బ్రీతి లేకుండుట, ఇంద్రియములకాత్మ కానరాకపోవుట వీనిచే మనస్సు విక్షేపము లేక యేకాగ్రమైనది. ఇటు లంత నేనుందును.

సమాధ్యాసాదివిక్షిప్తౌ వ్యవహారః సమాధయే,
ఏవం విలోక్య నియమమేవమేవాహమాస్థితః. ౩

సమాధ్యాసాది విక్షిప్తములవలన మనస్సు చెదరిననే సమాధికిఁ బ్రయత్నమావశ్యకము. ఇది కాంచి నేను స్వరూపస్థితినే యుందును.

హేయోపాదేయవిరహాదేవం హర్షవిషాదయోః,
అభావాదద్య హే బ్రహ్మన్నేవమేవాహమాస్థితః. ౪

# అష్టావక్రసంహిత

## ద్వాదశాధ్యాయము

---

### ఏవమేవాష్టక ప్రకరణము

జనకుఁడు:—

గీ. కాయకృత్యముల్ తొలుదొల్తఁ గష్టమయ్యెఁ
బిదప వాక్కర్మము లసహ్యపదము లయ్యె
నాత్మచింతలు నపుడసహ్యంబు లయ్యె
నట్లు నిజరూపసంస్థితి నంది యుంటి. ౧

గీ. శబ్దములయందుఁ బ్రీతి లేశమును లేమి
నింద్రియంబుల కాత్మ యదృశ్య మగుటఁ
ద్రివిధవిక్షేపముల వీడి ప్రవిమలహృది
యేకలక్ష్యంబుగాంచుట నిట్టు లుంటి. ౨

గీ. చిత్త మధ్యాస వలన విక్షిప్తమైన
వ్యవహరింత్రు సమాధి గావలయు ననుచు
గాంచి యుంటి నధ్యాస నేఁ గాంచ నెపుడు
గావున స్వరూపసంస్థితిఁ గ్రాలుచుందు. ౩

గీ. హేయ మగువస్తువులు నుపాదేయవిషయ
సమితి లేకుంట దుఃఖహర్షములు లేమి

హేయము నుపాదేయము ననునవి లేకుంటయుం, హర్షవిషాదములును లేకుండుటయుం గారణముగా నేఁడు బ్రహ్మమా! స్వస్థితి నుందును.

ఆశ్రమానాశ్రమం ధ్యానం చిత్తస్వీకృతవర్జనమ్,
వికల్పం మమ వీక్ష్యైతై రేవమేవాహమాస్థితః. ౫

ఆశ్రమము, అనాశ్రమము, ధ్యానము, మనోగుణవర్జనము—ఇవి నాకు వికల్పము గలిగించున వని గని, నేను స్వస్థితి నుందును.

కర్మానుష్ఠానమజ్ఞానాద్యథైవోపరమ స్తథా,
బుద్ధ్వా సమ్యగిదం తత్త్వమేవమేవాహమాస్థితః. ౬

కర్మమునకుఁ గర్మత్యాగమునకు నజ్ఞానమే కారణ మని యీ తత్త్వము బాగుగా గ్రహించి యిటు లీనిజస్థితి నుందును.

అచింత్యం చింత్యమానోఽపి చింతారూపం భజత్యసౌ,
త్యక్త్వా తద్భావనం తస్మాదేవమేవాహమాస్థితః. ౭

అచింత్య మైనదానిని జింతించుటకూడఁ జింతారూప భజనమే యని గ్రహించి యాభావము వీడి యిటు లీనిజస్థితి నుందును.

ఏవమేవ కృతం యేన స కృతార్థో భవేదసౌ,
ఏవమేవస్వభావో యః స కృతార్థో భవేదసౌ. ౮

ఈస్థితి సాధనమునఁ గన్నవాఁడు మిక్కిలిఁ గృతార్థుఁడు. ఇది స్వభావముచేతనే కన్నవాఁడు మఱియును గృతార్థుఁడు.

నోపరబ్రహ్మమా! నేఁడు నీపర మయిం
స్వస్వరూపనిరంజనస్వామి నైతి. ४

గీ. ఆశ్రమానాశ్రమంబులు ధ్యానచింత
చిత్తనిగ్రహావర్జనస్థితులు రెండు
గారణములు సంకల్పవికల్పములకు
వీనిఁ గని వీడి నిజరూపవేది నైతి. ౫

గీ. అరయఁ గర్తకుఁ గర్మసంత్యాగమునకు
నగును గారణ మజ్ఞాన మని యెఱింగి
యుభయమును లేనివాఁడనై యొప్పుచుండు
స్వస్వరూపసుఖాంబుధి సంచరింతు. ౬

గీ. అరయఁ జింతింపరాని బ్రహ్మమునుగూర్చి
చింతచేయుట దాని భుజించు టగును
గానఁ దద్భావనంబును దగఁ ద్యజించి
స్వస్వరూపంబునందు నొప్పారుచుందు. ౭

గీ. సాధనంబున నీయవస్థను గడించు
ధన్యుఁ డెన్నఁ గృతార్థుఁ డెంతయు నిజంబు
ఈయవస్థ స్వభావమై యొసక మెసఁగు
వాని ధన్యతఁ గొనియాడ వశము గాదు. ౮

---

# అష్టావక్రసంహితా

---

## త్రయోదశోఽధ్యాయః

### యథాసుఖసప్తకప్రకరణమ్

జనక ఉవాచ:—

అకించనభవం స్వాస్థ్యం కౌపీనత్వేఽపి దుర్లభమ్,
త్యాగాదానే విహాయాస్మాదహమాసే యథాసుఖమ్. ౧

సర్వత్యాగమువలనఁ గలిగిన స్వస్థచిత్తత కౌపీనముపైఁ గోరిక యున్నను దుర్లభమే యగును. కాన, ఇచ్చిపుచ్చుకొనుటలు మాని, నేను సుఖముందును.

కుత్రాపి ఖేదః కాయస్య జిహ్వా కుత్రాపి ఖిద్యతే,
మనః కుత్రాపి తత్త్యక్త్వా పురుషార్థే స్థితః సుఖమ్. ౨

ఒకచోట దేహదుఃఖము ఒకచోట జిహ్వాబాధ, మఱొకచో మహావిచారము, ఉండుచునే యుండును. వీని నెల్ల విడిచి పరమపురుషార్థమున సుఖముందును.

కృతం కిమపి నైవ స్యాదితి సంచింత్య తత్త్వతః,
యదా యత్కర్తుమాయాతి తత్కృత్వాసే యథాసుఖమ్.

ఏదియును నాత్మచేఁ జేయఁబడనిదేయని పూర్తిగా గ్రహించి, యేది చేయఁబడవలెనో యది చేయఁబడుచుండఁగా నే సుఖముందును.

కర్మనైష్కర్మ్యనిర్బంధభావా దేహస్థయోగినః,
సంయోగాయోగవిరహాదహమాసే యథాసుఖమ్. ౪

# అష్టావక్రసంహిత

## త్రయోదశాధ్యాయము

### యథాసుఖసప్తక ప్రకరణము

జనకుఁడు:—

గీ. సర్వసంగపరిత్యాగస్వాస్థ్య మెన్న
నరుదు కౌపీనమముకారి గ్రైనమాత్రఁ
గాన దానంబుఁ ద్యాగంబు నేను విడిచి
పరమసౌఖ్యానుభూతి నొప్పారుచుందు. ౧

గీ. ఎచటనో యట దేహంబు కెగ్గు గలుగు
నెచటనో యట జిహ్వకు నెగ్గు గలుగు
నెచటనో యట మనసున కెగ్గు గలుగు
నన్నిటిని వీడి పురుషార్థ మనుభవింతు. ౨

గీ. ఆత్మ యేమియు నొనరింప దనెడిసత్య
తత్త్వము గ్రహించి పిదప నెద్దానిఁ జేయ
వలయునో దానినే చేసి వఱలుచుందుఁ
బరమసౌఖ్యానుభూతి నొప్పారుచుందు. 3

గీ. దేహభావము గలయోగదివ్యులెల్లఁ
గర్మనైష్కర్మ్యముల బద్ధగాత్రు లగుట

దేహముపై మమకారము గలయోగులును గర్మమో నిష్కర్మమో కోరుదురు. సంయోగ వియోగములు లేని నేను మాత్రము సుఖముందును.

అర్థానర్థౌ న మే స్థిత్యా గత్యా న శయనేన వా,
తిష్ఠన్ గచ్ఛన్ స్వపన్ తస్మాదహమాసే యథాసుఖమ్. ౫

ఉండుట, పోవుట, నిద్రించుట—దేనిలోను నాకు లాభనష్టములు లేవు. ఉన్నను, గమించినను, నిద్రించినను నేను సుఖమే యుందును.

స్వపతో నాస్తి మే హానిః సిద్ధిర్యత్నవతో న వా,
నాశోల్లాసౌ విహాయాస్మా దహమాసే యథాసుఖమ్. ౬

నేను నిద్రించుచున్నను నష్టములేదు, యత్నించుచున్నను సిద్ధించుట లేదు. విచారము నానందము విడిచి నేను సుఖముందును.

సుఖాదిరూపానియమం భావేష్వాలోక్య భూరిశః,
శుభాశుభే విహాయాస్మాదహమాసే యథాసుఖమ్. ౭

సుఖాదులయొక్క యనియమత్వము ననేకవిషయములలో ననేక పర్యాయము చూచి, శుభాశుభముల విడిచి నేను సుఖముంటిని.

---

నే వియోగసంయోగముల్ పోవఁ గాంచి
పరమసౌఖ్యానుభూతి నొప్పారుచుందు. ౪

గీ. స్థితిగతిసుషుప్తులందు నేగతినినైన
నర్థము ననర్థమును నాకు నరయలేవు
స్థితిగతిసుషుప్తులందునఁ జెలఁగుచుండి
పరమసౌఖ్యానుభూతి నొప్పారుచుందు. ౫

గీ. నేను నిద్రించుచున్నను హాని రాదు
యత్న మొనరించినను సిద్ధియగుట లేదు
కాన నాశము నుల్లాస మేను వీడి
పరమసౌఖ్యానుభూతి నొప్పారుచుందు. ౬

గీ. పలుతెఱంగుల సౌఖ్యవిపర్యయములఁ
బలువిధంబులఁ జూచినవాఁడ నగుట
నశుభశుభతతి నెల్లఁ బోనాడి నేను
బరమసౌఖ్యానుభూతి నొప్పారుచుందు. ౭



# అష్టావక్ర సంహితా

## చతుర్దశో౽ధ్యాయః

---

### శాంతి చతుష్టయ ప్రకరణమ్

జనక ఉవాచ:—

ప్రకృత్యా శూన్యచిత్తో యః ప్రమాదాద్భావభావనః,
నిద్రితో బోధిత ఇవ క్షీణసంస్మరణో హి సః. ౧

ఎవనికి సహజముగాఁ గోరికలు లేనిమన స్సుండునో, ఎవఁడు ప్రమాదముచేత మాత్రమే భావించునో ఎవఁడు నిద్రించుచున్నను మెలఁకువగ నుండునో వాఁడే క్షీణించిన విషయస్మరణము కలవాఁడగును.

క్వ ధనాని క్వ మిత్రాణి క్వ మే విషయదస్యవః,
క్వ శాస్త్రం క్వ చ విజ్ఞానం యదా మే గలితా స్పృహా. ౨

నశించినకోరిక గలనాకు ధన మని మిత్రులని విషయము లను దొంగ లని శాస్త్ర మని విజ్ఞాన మని యెచటఁ గలవు?

విజ్ఞాతే సాక్షిపురుషే పరమాత్మని చేశ్వరే,
నైరాశ్యే బంధమోక్షే చ న చింతా ముక్తయే మమ. 3

సాక్షిపురుషుఁడు, ఈశ్వరుఁడు నైన పరమాత్ముని యెఱిఁగి బంధమోక్షములయందును నిరాశ గలనాకు ముక్తిచింతయే లేదు.

అంతర్వికల్పశూన్యస్య బహిఃస్వచ్ఛంద చారిణః
భ్రాంతస్యేవ దశాస్తాస్తాదృశా ఏవ జానతే. ౪

లోపల వికల్పమే లేక పైకి మాత్రము స్వేచ్ఛగా విహరించుచు భ్రాంతునివలెఁ గాననగుదశలు గలమహాత్ము నాతనియంతవాఁడే యెఱుఁగఁగలఁడు.

---

# అష్టావక్రసంహిత

## చతుర్దశాధ్యాయము

---

### శాంతిచతుష్టయప్రకరణము

జనకుఁడు:—

గీ. ప్రకృతిచే శూన్యచిత్త మెవ్వనికిఁ గలుగు
నెవఁడు భావించును బ్రమాదదృష్టివలన
నిద్రితుం డయ్యు భోధసన్నిరతుఁ డెవఁడు
అతఁడ యగు క్షీణసంస్మరణాధికుండు. ౧

గీ. ఎపుడు గళితస్పృహుండనై యొసఁగునాకు
నెచటఁ గల వింక ధనమిత్రనిచయ మెల్ల
నెచట నుండు విషయదస్యునిచయ మింకఁ ?
జనుఁ గదా శాస్త్రవిజ్ఞానసమితు లెల్ల. ౨

గీ. సాక్షిపురుషుండు మఱియు నీశ్వరుఁడు నైన
భవ్యపరమాత్మ విదుఁడనై పరగునాకు
బంధమోక్షద్వయంబు నిర్వాంఛిత మయి
యుంట నాకేల ముక్తికామ్యాపచింత. 3

గీ. అంతరంగవికల్పశూన్యత్వ ముండి
బాహ్యదృష్టికిస్వచ్ఛందపరతఁ దిరిగి
భ్రాంతమానవురీతి నొప్పారుజ్ఞాని
నంతవారలె తెలియంగఁ గాంతు రవని. ౪

---

# అష్టావక్రసంహితా

## పంచదశోఽధ్యాయః



## తత్త్వోపదేశవింశతి ప్రకరణమ్

అష్టావక్ర ఉవాచ:—

యథాతథోపదేశేన కృతార్థః సత్త్వబుద్ధిమాన్,
ఆజీవమపి జిజ్ఞాసుః పరస్తత్ర విముహ్యతి. ౧

సత్త్వబుద్ధి కలవాఁడు—అప్రయత్నముగ నుపదేశము విన్నంతనే కృతార్థుఁ డగును. అది లేనివాఁడు జీవిత మంతయుం విన్నను గలఁతపడును.

మోక్షో విషయవైరస్యం బంధో వైషయికో రసః,
ఏతావదేవ విజ్ఞానం యథేచ్ఛసి తథా కురు. ౨

విషయవైరస్యమే మోక్షము, విషయాసక్తియే బంధము, ఇదే విజ్ఞానము, ఇఁక నీయిచ్చవచ్చిన ట్లొనర్పుము.

వాగ్మిప్రాజ్ఞమహోద్యోగం జనం మూకజడాలసమ్,
కరోతి తత్త్వబోధోఽయమతస్త్యక్తో బుభుక్షుభిః. 3

వాగ్మిని మూకునిగను, ప్రాజ్ఞుని జడునిగను, ఉద్యోగి నలసునిగను, తత్త్వబోధ చేయును. అందుచేఁ బ్రాపంచికసుఖలోలురు దానిని విడుతురు.

న త్వం దేహో న తే దేహో భోక్తా కర్తా న వా భవాన్,
చిద్రూపోఽసి సదా సాక్షీ నిరపేక్షః సుఖం చర. ౪

ఈదేహము నీది కాదు. నీవు దేహమే కావు. నీవు కర్తవు గావు. భోక్తవు గావు. చిద్రూపుఁడవే. ఎల్లప్పుడు సాక్షివి, నిరపేక్షివి, సుఖింపుము.

# అష్టావక్రసంహిత

## పంచదశాధ్యాయము



### తత్త్వోపదేశవింశతిప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. సత్త్వబుద్ధిని వెలుఁగొందుసజ్జనుండు
పరమసులభోపదేశముఁ బడసినంత
నగుఁ గృతార్థుఁడు; పరుఁడు జన్మావసాన
కాలపర్యంత మది విని కలఁత నొందు. ౧

గీ. విషయవైరస్య మగు మోక్షవిధసుఖంబు
విషయలోలత్వమే బంధవిధము దెలియ
నిదియె విజ్ఞాన మిది గ్రహియించి నీవు
నీకుఁ దోఁచినయట్టు లన్నియు నొనర్పు. ౨

గీ. వాఙ్మిఁ బ్రాజ్ఞు మహోద్యోగవంతునైన
మూఁకు జడు నలసుని దత్త్వబోధ చేయుఁ
గాన నైహికసౌఖ్యాభికాంక్షు లెల్లఁ
దత్త్వబోధముకడనుండి తలఁగుచుంద్రు. ౩

గీ. ఈశరీరము నీవుగా విదియు నీది
కాదు; కర్తవు భోక్తవు గావు నీవు
చిత్స్వరూపసదాసాక్షిచిన్మయుండ
వగుదు నిరపేక్షు వగుదు సౌఖ్యమునఁ బొమ్ము. ౪

రాగద్వేషౌ మనోధర్మౌ న మనస్తే కదాచన,
నిర్వికల్పోఽసి బోధాత్మా నిర్వికారః సుఖం చర. ౫

రాగద్వేషములు మనోధర్మములు. మన స్సెన్నఁడు నీది కాదు. నీవు నిర్వికల్పుఁడవు. బోధాత్ముఁడవు. నిర్వికారుఁడవు. సుఖింపుము.

సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని,
విజ్ఞాయ నిరహంకారో నిర్మమస్త్వం సుఖీ భవ. ౬

సర్వభూతములలో నాత్మయు, నాత్మయందు సర్వభూతములును గుర్తెఱిఁగి నిరహంకార నిర్మమత్వములచే సుఖ ముండుము.

విశ్వం స్ఫురతి యత్రేదం తరంగా ఇవ సాగరే,
తత్త్వమేవ న సందేహశ్చిన్మూర్తే విజ్వరో భవ. ౭

ఓచిన్మూర్తీ! సాగరమునఁ దరంగములవలె నీలో విశ్వమున్నది. ఇదే తత్త్వము. సందేహింపక జ్వరముక్తుఁడవు కమ్ము.

శ్రద్ధస్వ తాత శ్రద్ధస్వ నాత్ర మోహం కురుష్వభోః,
జ్ఞానస్వరూపో భగవానాత్మా త్వం ప్రకృతేః పరః. ౮

వత్సా! శ్రద్ధయుంచుము, శ్రద్ధ యుంచుము. మోహము నందకుము. జ్ఞానస్వరూపుఁడవు, భగవానుఁడవు, ఆత్మవు, ప్రకృతికిఁ బరుఁడవు నీవే.

గుణైః సంవేష్టితో దేహస్తిష్ఠత్యాయాతి యాతి చ,
ఆత్మా న గంతా నాగంతా కిమేనమనుశోచసి. ౯

దేహసంవేష్టితము లగుగుణములు వచ్చి, యుండి, పోవును. ఆత్మ వచ్చునది కాదు: పోవునది కాదు. ఇఁక విచారింపఁ బని యేమి?

దేహస్తిష్ఠతు కల్పాంతం గచ్ఛత్వద్యైవ వా పునః,
క్వ వృద్ధిః క్వ చ వా హానిః తవ చిన్మాత్రరూపిణః. ౧౦

ఈదేహము కల్పాంత మున్నను నిపుడే పోయినను—పోనిమ్ము, -చిన్మాత్రరూపుఁడ వగు నీకు హానివృద్ధులు లేవు.

గీ. తలఁప రాగంబు ద్వేషంబు ధర్మము లగు
మనమునకు, నీది కా దెప్పుడును మనస్సు
నిర్వికల్పబోధాత్ముఁడు నిర్వికారి
వగుదు దీని నెఱింగి సౌఖ్యమునఁ బొమ్ము. ౫

గీ. సర్వభూతంబు లందాత్మ సర్వ మాత్మఁ
గాంచఁ జాలి యహంకార కలనఁ ద్రోలి
నిర్మమత్వంబు గల్గియు నిత్యసౌఖ్య
నిరతి నొప్పారఁ బొమ్ము నిర్నిమిషదృష్టి. ౬

గీ. సాగరంబునఁ దోఁచువీచీగణమ్ము
విధముగాఁ దోఁచు నీయందు విశ్వ మెల్ల
నోయి! చిన్మూర్తి! నీవాదు వీయ దెల్లఁ
గాన జ్వరముక్తతను సౌఖ్యమ్ము గనుము. ౭

గీ. నిలుపు మత్యంతమును శ్రద్ధ నిలుపు వత్స!
యొన్నఁడును మోసపోకు మోయీ! తలంప
జ్ఞానమూర్తివి ప్రభుఁడ వాత్మానురూపి
వరయ సత్యము ప్రకృతికిఁ బరుఁడ వీవు. ౮

గీ. గుణము లవి యెల్ల దేహాసంకులము లగుట
దేహ ముద్భవమై నిల్చి తిరిగి పోవు
నాత్మ వచ్చుట పోవుట యనున దెఱుఁగ
దేల యనుశోచనం బింక నిది యెఱుంగ. ౯

గీ. ఈశరీరము కల్పాంత మిందు నున్న
నిపుడె నశియించినను దీన నేమి గలదు?
నీవు చిన్మాత్రరూపివై నెగడుచుంటఁ
గలవె నీ కింక హానివృద్ధులు తలంప? ౧౦

త్వయ్యనంతమహాంభోధౌ విశ్వవీచిః స్వభావతః,
ఉదేతు వాస్తమాయాతు న తే వృద్ధిర్న వా క్షతిః. ౧౧

నీ వనునవనంతసాగరమున విశ్వము లనునలలు సహజముగా వెలువడ నిమ్ము లేక నశింపనిమ్ము. దాన, నీకు వృద్ధిక్షయములు లేవు.

తాత చిన్మాత్రరూపోఽసి న తే భిన్న మిదం జగత్,
అతః కస్య కథం కుత్ర హేయోపాదేయకల్పనా. ౧౨

వత్సా! నీవు చిన్మాత్రరూపివే. ఈ విశ్వము నీకంటె వేఱు కాదు. కావున, గ్రహించునది త్యజించునది యెవరు? ఎట్లెక్కడ నవి జరగును?

ఏకస్మిన్నవ్యయే శాంతే చిదాకాశేఽమలే త్వయి,
కుతో జన్మ కుతః కర్మ కుతోఽహంకార ఏవ చ. ౧౩

ఏకేశ్వరుఁడవు, అవ్యయుఁడవు, శాంతుఁడవు, చిదాకాశమవు, అమలుఁడ వగునీకు జన్మము, కర్మము, అహంకారము ఎచటనుండి వచ్చును?

యత్త్వం పశ్యసి తత్రైక స్త్వమేవ ప్రతిభాససే,
కిం పృథక్ భాసతే స్వర్ణాత్ కటకాంగదనూపురమ్. ౧౪

నీవు చూచు వానియం దెల్ల నీవే ప్రతిభాసింతువు. కటకము అంగదము, నూపురము నను నాభరణములు బంగరునుండి వే ఱగునా?

అయం సోఽహమయం నాహం విభాగమితిసంత్యజ,
సర్వమాత్మేతి నిశ్చిత్య నిస్సంకల్పః సుఖీ భవ. ౧౫

నేను 'సోఽహము'ను నేను నాహమును అనువిభాగములు విడిచి సర్వమాత్మయే యని నిశ్చయించి నిస్సంకల్పమున సుఖింపుము.

తవైవాజ్ఞానతో విశ్వం త్వమేకః పరమార్థతః,
త్వత్తోఽన్యో నాస్తి సంసారీ నాసంసారీచ కశ్చన. ౧౬

విశ్వమనునది నీయజ్ఞానము తక్క వేఱు కాదు. నిజముగా నీ వొక్కఁడవే. జీవుఁ డని యీశ్వరుఁ డని నీవే తక్క నన్యులు లేరు.

గీ. నీ వనునయనంతదివ్యవార్నిధిని సతము
విశ్వవీచిక లవి యెల్ల వెడలి పిదప
నస్తమించు స్వభావమై యంతె కాని
హానివృద్ధులు గలవె యేమైన నీకు ? ౧౧

గీ. వత్స ! చిన్మాత్రుఁడవు నీవు పరిగణింప
నగుట విశ్వము భిన్నమెట్లగుచు నీకు ?
హేయకల్పనమఱి యుపాదేయకల్ప
నంబుఁ గల్గునె ? యెచ్చటనైన నీకు ? ౧౨

గీ. నీ వొకండవు నవ్యయనిర్మలుఁడవు
శాంతమూర్తి చిదాకాశసరళహృదయు
వగుట నీ కెట్లు కల్గు జన్మాదు లెన్నఁ
గర్మములు నహంకార మేకరణిఁ గల్గు ? ౧౩

గీ. ఏపదార్థంబు గాంచిన నెందునైన
నీస్వరూపము భాసించు నిత్య మరయఁ
గటక మంగదనూపురాకారము లవి
స్వర్ణమున నుండి వేఱుగాఁ జనునె యెందు ? ౧౪

గీ. 'సోఽహ' మనియును మఱియును 'నాఽహ' మనియు
నాది యైనవిభాగముల్ బూదిగలిపి
సర్వ మాత్మయె యనెడివిచారమునను
సర్వసంకల్పముల వీడి సౌఖ్యముండు. ౧౫

గీ. విశ్వభావన మజ్ఞాన బీజ జనిత
మంతియే నీవ పరమార్థ మరసి చూడ
నీవు దక్కఁ నన్యుఁడు లేఁడు జీవుఁ డనఁగ
నీశ్వరుఁ డనంగ వేఱ్వేఱ శాశ్వతముగ. ౧౬

భ్రాంతిమాత్రమిదం విశ్వం న కించిదితి నిశ్చయీ,
నిర్వాసనః స్ఫూర్తిమాత్రో న కించిదివ శామ్యతి. ౧౭

విశ్వము భ్రాంతిమాత్రమే యనియు మిథ్య యనియు నిశ్చయించి నతఁడు వాసనాహీనుఁడు స్ఫూర్తిమాత్రుఁడునై సర్వము మిథ్య యని శాంతి నందును.

ఏక ఏవ భవాంభోధావాసీదస్తి భవిష్యతి,
నతే బంధోఽస్తి మోక్షో వా కృతకృత్యః సుఖం చర. ౧౮

భవసాగరమున నొక్కటే యున్నది; ప్రస్తుతము కలదు; ముందుండును, నీకు బంధమును లేదు మోక్షమును లేదు. కృతకృత్యుఁడవై సుఖింపుము.

మా సంకల్పవికల్పాభ్యాం చిత్తం క్షోభయ చిన్మయ,
ఉపశామ్య సుఖం తిష్ఠ స్వాత్మన్యానందవిగ్రహే. ౧౯

ఓ చిన్మయా! సంకల్ప వికల్పములచే నీమనస్సు క్షోభపఱచుకొనకుము, ఉపశమించి యానందనిధాన మగు నాత్మస్వరూపమున సుఖముండుము.

త్యక్త్వైవ ధ్యానం సర్వత్ర మా కించిద్ధృది ధారయ,
ఆత్మా త్వం ముక్త ఏవాసి కిం విమృశ్య కరిష్యసి. ౨౦

ధ్యానము కూడ మానివేసి హృదయమున నేమియు లేకుండఁ జేసికొనుము. నీవే ఆత్మవు. ముక్తుఁడవు. ఇఁక దేనిని జింతింతువు?

---

గీ. భ్రాంతిమాత్రమే జగ మను భావ నిశ్చ
యమును గించిత్తు గా దని యని గ్రహింప
వాసనాహీనుఁడై యేను వఱలనట్లు
స్ఫూర్తిమాత్రుఁడై విశ్రాంతి బొందు నరుఁడు. ౧౭

గీ. విశ్వవార్నిధియందు భావింప నొక్క
రుండె యుండె నున్నాఁడు ముం దుండు నింక
నీకు బంధమోక్షము లెన్న నిజము లేవు
కానఁ గృతకృత్యుఁడవు సౌఖ్యగరిమఁ గనుము. ౧౮

గీ. చిన్మయానందరూప! నీచిత్తమునకు
క్షోభ రానీకు సంకల్పకురువికల్ప
ములను శాంతంబు నంది యామోదజలధి
నోలలాడు స్వాత్మానందపూరమందు. ౧౯

గీ. ధ్యాన మెప్పుడుఁ ద్యజియించి మానసమున
నేమియును లేనిరీతి గావింపుమయ్య!
యాత్మ వీవే మహాత్మ! ముక్తాంతరాత్మ!
యేమి పడయుదు చింతచే నింక నీవు? ౨౦



# అష్టావక్రసంహితా

## షోడశోఽధ్యాయః

## విశేషోపదేశక ప్రకరణమ్

అష్టావక్ర ఉవాచ:—

ఆచక్ష్వ శృణు వా తాత నానాశాస్త్రాణ్యనేకశః,
తథాపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే. ౧

వత్సా! నీ విదివఱలో ననేకపర్యాయము లనేకశాస్త్రములు కని విని యుండవచ్చును. అంత నీవు స్వాస్థ్యముగన లేవు. వానిని మఱచుశక్తి గనవలెను.

భోగం కర్మ సమాధిం వా కురు విజ్ఞ తథాపి తే,
చిత్తం నిరస్తసర్వాశమత్యర్థం రోచయిష్యతి. ౨

ఓ విజ్ఞుఁడా! నీవు భోగింపుము. కర్మచేయుము. సమాధిస్థితి నందుము. కాని నీమనస్సు మాత్రము సర్వాశలు నశించి పరమార్థ మగుదానియందే యుంచుము.

ఆయాసాత్ సకలో దుఃఖీ నైనం జానాతి కశ్చన,
అనేనైవోపదేశేన ధన్యః ప్రాప్నోతి నిర్వృతిమ్. ౩

ఆయాసమే సకలదుఃఖకారణము. ఈవిషయ మెవ్వరికిని దెలియదు. ధన్యపురుషుఁ డీ మహోపదేశమున నే నిర్వృతి నందును.

వ్యాపారే ఖిద్యతే యస్తు నిమేషోన్మేషయోరపి,
తస్యాలస్యధురీణస్య సుఖం నాన్యస్య కస్యచిత్. ౪

కనుఱెప్ప మూతపడుట విడివడుట యన్న కార్యముకూడ నెవని కాలస్యహేతువు బాధాకరము నగునో యాయాలస్యధురీణుఁడే సుఖ మంతుఁడు. అన్యుఁడు కాఁడు.

ఇదం కృతమిదం నేతి ద్వంద్వైర్ముక్తం యదా మనః,
ధర్మార్థకామమోక్షేషు నిరపేక్షం తదా భవేత్. ౫

ఇది చేయఁబడినది యది చేయఁబడ లేదనెడి ద్వంద్వముల కతీత మైన మనస్సు ధర్మార్థకామ మోక్షములపట్లఁగూడ నిరపేక్షమే యగును.

# అష్టావక్రసంహిత

## షోడశాధ్యాయము

### విశేషోపదేశక ప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. వివిధశాస్త్రంబుల ననేకవేళలందు
వత్స! కని విని యుండఁగా వచ్చు నీవు
కాని నీ వింత స్వాస్థ్యంబు గాంచలేవు
సర్వవిస్మరణానంతశక్తి లేక. ౧

గీ. భోగకర్మసమాధుల మునిఁగి నీవు
సంచరింపఁగ వచ్చు విజ్ఞాని! కాని
నీదుచిత్తము కాంక్షించి నెగడవలయుఁ
బ్రబలవాంఛోపహార మా పరమపదవి. ౨

గీ. కనఁగ నాయాస మఖిల దుఃఖప్రదంబు
దీని నెవ్వఁ డెఱుంగఁ డజ్ఞానమునను
ఈమహోపదేశంబున నే మహాత్ముఁ
డందఁ గలుగుచు నుండు నత్యంతపదవి. ౩

గీ. కన్ను దెఱచుట మూయుట యన్నయదియు
నేమహాత్మున కాలస్యహేతు వగుచు
నగును బాధాకరం బట్టి యతనిసుఖము
గాంచఁజాలఁ డన్యుం డెందు నిక్కంబుసుమ్ము. ౪

గీ. "ఇది కృతం" "బిది యకృత" మన్నది మొదలుగఁ
గలుగు ద్వంద్వంబులను దాటఁగలమనంబు
నగును నిరపేక్ష మెల్లధర్మార్థకామ
మోక్షములయందుఁగూడ సమీక్ష సేయ. ౫

విరక్తో విషయద్వేష్టా రాగీ విషయలోలుపః,
గ్రహమోక్షవిహీనస్తు న విరక్తో న రాగవాన్. ౬

విరక్తుఁడు విషయముల ద్వేషించును. రాగి విషయలోలుఁ డగును: స్వీకృతి, విసర్జనము లేనివాఁడు విరాగియుఁ గాఁడు; రాగియుఁ గాఁడు.

హేయోపాదేయతా తావత్ సంసారవిటపాంకురః,
స్పృహా జీవతి యావద్వై నిర్విచారదశాస్పదమ్. ౭

సదసద్విచారము లేనిదశకు నిలయ మగుకోరిక యెంతకాల ముండునో సంసారవిటపాంకురము లగు నిష్టానిష్టము లంతకాలము నుండి తీఱును.

ప్రవృత్తౌ జాయతే రాగో నివృత్తౌ ద్వేష ఏవహి,
నిర్ద్వంద్వో బాలవద్ధీమానేవ మేవ వ్యవస్థితః. ౮

ప్రవృత్తి రాగమును నివృత్తి ద్వేషమును గలిగించును. ధీమహితుఁడు బాలునివలె నిర్ద్వంద్వుఁడై యథాసుఖ మనుభవించును.

హాతుమిచ్ఛతి సంసారమ్ రాగీ దుఃఖజిహాసయా,
వీతరాగోహి నిర్దుఃఖ స్తస్మిన్నపి న ఖిద్యతి. ౯

సంసారమమకారము గలవాఁడు దుఃఖనివృత్తికి సంసారముఁ విడువఁగోరును. రాగము లేనివాఁడు దుఃఖములేనివాఁ డగుట సంసారియైనను దుఃఖింపఁడు.

యస్యాభిమానో మోక్షేఽపి దేహేఽపి మమతా తథా,
న చ జ్ఞానీ న వా యోగీ కేవలం దుఃఖభాగసౌ. ౧౦

మోక్షమునకైన నభిమానము దేహమందు మమకారము యెవని కుండునో వాఁడు జ్ఞానియుఁ గాఁడు; యోగియుఁ గాఁడు. దుఃఖభాగుఁడే.

హరో యద్యుపదేష్టా తే హరిః కమలజోఽపి వా,
తథాపి న తవ స్వాస్థ్యం సర్వవిస్మరణాదృతే. ౧౧

శివుఁడు కాని విష్ణువు కాని లేక బ్రహ్మయే కాని నీ కుపదేష్టయైనను. సర్వవిస్మరణాదరము గలిగిననే కాని స్వస్థత నందనే లేవు.

---

గీ. విషయసుఖముల ద్వేషించు వే విరాగి
విషయలోలుండు నగు రాగి వీనిఁ గాంచి
గ్రహణమోక్షము లే లేనిఘనుఁడు చూడ
రాగియును గాఁడు మఱియు విరాగి కాఁడు. ౬

గీ. హేయ మెన్న నుపాదేయ మెంచి చూడఁ
బ్రబలసంసార విటపాంకురంబు లగుచు
నిర్విచార దశాస్పద నిఖిల కార్య
నిరతి రొందఁడాఁక నుండు నాపఱకు నుండు. ౭

గీ. కలుగు ననురాగము ప్రవృత్తికలన నెపుడు
ద్వేష ముద్భూత మౌను నివృత్తివలన
విజ్ఞుఁ డెన్నఁడు బాలునివిధముఁ గాఁగ
ద్వంద్వరహితుఁడై నిశ్చింతఁ దనరుచుండు. ౮

గీ. దుఃఖసందోహముల నెల్లఁ ద్రోసిపుచ్చు
రాగవంతుఁడు సంసార మీఁగఁజాలు
రాగరహితుఁడు సకలార్తిరహితుఁ డగుట
దుఃఖపడఁడు సంసారంబుతోడ నున్న. ౯

గీ. అరయ మోహాభిమాన మింతైన నున్నఁ
దనశరీరముఁ దనదిగాఁ దలఁచునతఁడు
జ్ఞాని కాఁడు యోగియుఁ గాఁడు గాన నతఁడు
పరమభీకరదుఃఖనిబద్ధుఁ డగును. ౧౦

గీ. హరహరులు గాని లేక బ్రహ్మైనఁ గాని
నీకు నుపదేష్ట కానిమ్ము నిక్క మరయ
సర్వవిస్మరణానంతశక్తి లేక
నీవు స్వాస్థ్యము నందనే లేవుసుమ్ము. ౧౧

# అష్టావక్రసంహితా

## సప్తదశోఽధ్యాయః



### తత్త్వజ్ఞస్వరూప వింశతిక ప్రకరణమ్

అష్టావక్ర ఉవాచ:—

తేన జ్ఞానఫలం ప్రాప్తం యోగాభ్యాసఫలం తథా,
తృప్తః స్వచ్ఛేంద్రియో నిత్యమేకాకీ రమతే తు యః. ౧

తృప్తుఁడు స్వచ్ఛేంద్రియుఁడు, నిత్యము నేకాకియై యెవండు రమించునో వాఁడే జ్ఞానఫలము, యోగఫలమును బొందినవాఁడు.

న కదాచిజ్జగత్యస్మిన్ తత్త్వజ్ఞో హంత ఖిద్యతి,
యత ఏకేన తేనేదం పూర్ణం బ్రహ్మాండమండలమ్. ౨

ఆహా! తత్త్వజ్ఞుఁ డెన్నఁ డీ జగమున ఖేదము నందఁడు. ఏలయన, బ్రహ్మాండమండల మెల్ల నాతనిచేఁ బూర్ణమై యున్నదే కదా!

న జాతు విషయాః కేఽపి స్వారామం హర్షయంత్యమీ,
సల్లకీపల్లవప్రీతమివేభం నింబపల్లవాః. ౩

ఆత్మానందమునఁ గ్రీడించువాతనికి విషయసుఖములు ప్రీతినీయవు. సల్లకీ పల్లవముల నుల్లసించు నేనుఁగునకు నింబపత్రములు రుచింపవుగదా!

యస్తు భోగేషు భుక్తేషు న భవత్యధివాసితా,
అభుక్తేషు నిరాకాంక్షీ తాదృశో భవదుర్లభః. ౪

భోగించినవస్తువులపై మరలఁ గామ్యము లేనివాఁడును ననుభవింపని వస్తువులపైఁ గోరిక లేనివాఁడును జగమున లేరు.

# అష్టావక్రసంహితా

## సప్తదశాధ్యాయము

### తత్త్వజ్ఞస్వరూపవింశతికప్రకరణము

అష్టావక్రుఁడు:—

గీ. ఎవఁడు తృప్తుఁడు మఱియు స్వచ్ఛేంద్రియుఁడు
నిత్య మేకాకియై యాత్మ నిరతి నుండు
నతఁడె జ్ఞానఫలప్రాప్తి నందినతఁడు
అతఁడె యోగఫలంబు గన్నట్టియతఁడు. ౧

గీ. అరయ బ్రహ్మాండమండల మంతఁ గూడ
నతనిచేతనె పూర్ణమై యమరుకతనఁ
బరమతత్త్వజ్ఞుఁ డెన్నఁ డెప్పటికిఁ గాని
ఖేద మన్నది గనఁడు తత్కృతజగమున. ౨

గీ. సల్లకీపల్లవంబుల నుల్లసిల్లు
కరికి నింబపత్త్రము రుచి కానియట్లు
నరయ నిత్య మాత్మారాముఁ డగునతనికి
విషయసుఖములు గావు సంప్రీతికరము. ౩

గీ. తాను భోగించినట్టిపదార్థములను
మరల వాంఛింప కుండనిమానవుండు
మఱి యభోగ్యములందుఁ గామంబు లేని
వాఁడు చూడంగ నెటఁ గానరాఁడు జగతి. ౪

బుభుక్షురిహ సంసారే ముముక్షురపి దృశ్యతే,
భోగమోక్షనిరాకాంక్షీ విరలో హి మహాశయః. ౫

సంసారసుఖమును గోరువాఁడు ముముక్షుత్వమును గోరువాఁడు జగమునఁ గలరు. కాని, భోగమోక్షములఁ గాంక్ష లేనిమహాత్ముఁ డెచ్చటను లేఁడు.

ధర్మార్థకామమోక్షేషు జీవితే మరణే తథా,
కస్యాప్యుదారచిత్తస్య హేయోపాదేయతా న హి. ౬

ధర్మార్థకామమోక్షములయందు, జీవితమరణములయందు నెంతటి యుదారచిత్తుఁడో కాని యిష్టానిష్టముల లేక యుండఁడు.

వాంఛా న విశ్వవిలయే న ద్వేషస్తస్య చ స్థితౌ,
యథా జీవికయా తస్మాద్ధన్య ఆస్తే యథాసుఖమ్. ౭

విశ్వవిలయమున వాంఛ విశ్వస్థితికి ద్వేషము ధన్యపురుషున కెన్నఁడుండదు. యదృచ్ఛాలాభజీవనమున నాతఁడు సుఖముండును.

కృతార్థోఽనేన జ్ఞానేనేత్యేవం గళితధీః కృతీ,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్నాస్తే యథాసుఖమ్.

ఈజ్ఞానముచేఁ గృతార్థుఁడై మనసు నిర్మలమై తృప్తి నుండ ధీమంతుఁడు చూచుచు వినుచు ముట్టుచు ఘ్రాణించుచుఁ దినుచు సుఖముండును.

శూన్యా దృష్టిర్వృథా చేష్టా వికలానీంద్రియాణి చ,
న స్పృహా న విరక్తిర్వా క్షీణసంసారసాగరే. ౯

సంసారసాగర మింకిపోయినవానికి దేనిపైనను స్పృహ కాని విరక్తి కాని యుండదు. శూన్యదృక్కు, వ్యర్థచేష్ట, వికలేంద్రియములే యుండును.

న జాగర్తి న నిద్రాతి నోన్మీలతి న మీలతి,
అహో పరదశా క్వాపి వర్తతే ముక్తచేతసః. ౧౦

ముక్తచేతసుఁడు మేలుకొనఁడు; నిద్రింపఁడు, ఱెప్పలు మూయఁడు, తెఱచియుంచఁడు. ఆహా! ఆతఁ డెల్లప్పుడు ముక్తబుద్ధియే యగును.

గీ. సారసంసారసౌఖ్యంబు గోరునతఁడుఁ
బరమమోక్షము వాంఛించునరుఁడు జగతిఁ
గానవత్తురు గాని యొక్కాలమందు
భోగమోక్షనిరాకాంక్షి భువిని లేఁడు. ౫

గీ. అమలధర్మార్థకామమోక్షములయందు
జీవనంబున మరణంబుచెంతఁ గూడ
హేయమును నుపాదేయముఁబాయఁగనుట
యెంతటియుదారవంతునివంతో చూడ. ౬

గీ. ఈజగద్విలయంబున నింత వాంఛ
యీజగత్స్థితియందు నొక్కింత ద్వేష
మెఱుఁగకే ధన్యజీవనుఁ డెప్పు డెట్టు
లెంత వచ్చిన నంత జీవించు సుఖిత. ౭

గీ. పూర్వబోధితజ్ఞానసంపూర్ణుఁ డగుచు
మనసు నిలువఁగ సంతృప్తి యినుమడింప
జ్ఞాని గనుచును వినుచును బూని యెల్ల
ముట్టుచుఁ దినుచు ఘ్రాణించు మోదమందు. ౮

గీ. సాగరోపమసంసృతి క్షయము గాంచు
జ్ఞాని స్పృహయు విరక్తియుఁ గానఁ డెపుడు
శూన్యదృక్కును వ్యర్థచేష్టోపహతుఁడు
నిత్యవికలేంద్రియుండునై నెగడుచుండు. ౯

గీ. జాగరం బెప్పుడునుగూడ జ్ఞాని కనఁడు
నిద్రయును బోవఁ డాతం డనిమిషురీతి
ముక్తచేతస్కుఁ డైనయప్పుణ్యపురుషుఁ
డనవరతమును బరదశ నంది వెలుఁగు. ౧౦

సర్వత్ర దృశ్యతే స్వస్థః సర్వత్ర విమలాశయః,
సమస్తవాసనాముక్తో ముక్తః సర్వత్ర రాజతే. ౧౧

ముక్తపురుషుఁ డెల్లపుడు స్వస్థచిత్తుఁడు, విమలాశయుఁడు, సకలవాసనావిముక్తుఁడు నై కానవగును.

పశ్యన్ శృణ్వన్స్పృశన్జిఘ్రన్నశ్నన్గృహ్ణన్వదన్వ్రజన్,
ఈహితానీహితైర్ముక్తో ముక్త ఏవ మహాశయః. ౧౨

చూచుచు, వినుచు, ముట్టుచు, ఘ్రాణించుచుఁ, దినుచు, గ్రహించుచు పలుకుచు, నడచుచు ముక్తుఁ డీహితానీహితముల వీడి సుఖించును.

ననిందతి న చ స్తౌతి న హృష్యతి న కుప్యతి
న దదాతి న గృహ్ణాతి ముక్తః సర్వత్ర నీరసః.

ముక్తపురుషుఁ డెన్నఁడు నొరుల నిందింపఁడు; స్తుతింపఁడు; సంతోషింపఁడు; కోపింపఁడు; ఈయఁడు; కైకొనఁడు. అన్నిటిపైన నాతఁడు నిర్మముఁడే.

సానురాగాం స్త్రియం దృష్ట్వా మృత్యుం వా సముపస్థితమ్,
అవిహ్వలమనాః స్వస్థో ముక్త ఏవ మహాశయః. ౧౪

మహాశయుఁడు సానురాగ యగుస్త్రీకడను మీఁదఁబడఁబోవు మృత్యువు కడను గూడ చలింపఁడు. మఱియు స్వస్థచిత్తుఁ డగును. అతఁడే నిజ మగు ముక్తుఁడు.

సుఖే దుఃఖే నరే నార్యాం సంపత్సు చ విపత్సు చ,
విశేషో నైవ ధీరస్య సర్వత్ర సమదర్శినః. ౧౫

అన్నిటియందు సమదృష్టి గలధీరుఁడు సుఖదుఃఖములను, నరనారులను, సంపద్విపత్తులను విశేషము కనుఁగొనఁడు.

న హింసా నైవ కారుణ్యం నౌద్ధత్యం న చ దీనతా,
నాశ్చర్యం నైవ చ క్షోభః క్షీణసంసరణే నరే. ౧౬

గీ. నిత్యమాత్మానురూపి యై నెగడుచుండు
నిత్యమును నిర్మలాత్ముఁ డై స్తుత్యుఁ డగును
సర్వవాసనాముక్తుఁ డై సర్వకాల
మందు వెలయును ముక్తుఁ డహర్నిశంబు. ౧౧

గీ. కనుచు వినుచును ముట్టుచు ఘ్రాణ మొనరఁ
జేయుచును దించుఁ గైకొంచు స్వీయవాక్య
ములను బల్కుచు నడచుచు ముక్తపురుషుఁ
డీహితానీహితంబుల నీఁగు ఘనత. ౧౨

గీ. నింద చేయక స్తుతియింప నేరఁ బోక
సంతసింపక కోపభాజనత లేక
దానమును స్వీకరణము వేమేని లేక
నిత్యమును ముక్తపురుషుఁ డునీరసుఁడగు. ౧౩

గీ. సానురాగానురూప యోషాసతినిఁ గనియు
మీఁదఁ బడిపోవు మృత్యుసామీప్యమునను
సంచలింపనిమనమున స్వస్థచిత్తుఁ
డగుమహాత్ముఁడు ముక్తుఁ డహర్నిశంబు. ౧౪

గీ. సర్వసమదర్శియైన సౌజన్యమూర్తి
సర్వసుఖదుఃఖములయందు సముఁడై యగును
పురుషనారీజనంబుల నిరుపమాన
సంపదల విపత్తుల విశేషసముఁ డరయ. ౧౫

గీ. క్షీణసంసృతి గల్గునక్షీణపుణ్యుఁ
డెఱుఁగునే హింసయు నహింస యెన్నఁడేని ?

క్షీణించినసంసారము గలిగి నరుఁడే కానిమహాత్మునకు హింసాకారుణ్యములు, దీనత్వౌద్ధత్యములు, ఆశ్చర్యక్షోభములు లేవు.

న ముక్తో విషయద్వేష్టా న వా విషయలోలుపః,
అసంసక్తమనా నిత్యం ప్రాప్తాప్రాప్తముపాశ్నుతే. ౧౭

ముక్తుఁడు విషయద్వేషియుఁ గాఁడు; విషయలోలుఁడును గాఁడు. సక్తము కాని మనస్సుతోఁ బ్రాప్తాప్రాప్తముల ననుభవించి సుఖించును.

సమాధానాసమాధానహితాహితవికల్పనా,
శూన్యచిత్తో న జానాతి కైవల్యమివ సంస్థితః. ౧౮

శూన్యచిత్తము గలమహాత్ముఁడు సమాధానాసమాధానములు, హితాహితములు నెఱుఁగఁడు. అతఁడే కైవల్యసుస్థితుఁడు.

నిర్మమో నిరహంకారో న కించిదితి నిశ్చితః,
అంతర్గళితసర్వాశః కుర్వన్నపి కరోతి న, ౧౯

నిర్మముఁడు, నిరహంకారుఁడు, కించిత్తు లే దని తెలియువాఁడు, సర్వకామములను ద్రోలినవాఁడు నగుజ్ఞాని పని చేసి చేయనివాఁ డగును.

మనఃప్రకాశసమ్మోహస్వప్నజాడ్యవివర్జితః,
దశాం కామపి సంప్రాప్తో భవేద్గళితమానసః. ౨౦

మనోద్భవము లగుసమ్మోహము, స్వప్నము, జాడ్యము మున్నగునవి వీడి కోరికలు నశించినమనస్సు గలవాఁ డొకమహోన్నతదశ నందినవాఁ డగును.

---

యుద్ధతియు దీనభావవిరుద్ధములను
నచ్చెరువు క్షోభయు నమర్త్యుం డగుకతమున. ౧౬

గీ. విజ్ఞపురుషుఁడు విషయవిద్వేషి గాఁడు
విషయలోలుపుఁడును గాఁడు విశదభంగి
సక్తరహితమనంబున సంతతంబుఁ
బ్రాప్త మప్రాప్తముల నంది పరగు సుఖిత. ౧౭

గీ. శూన్యచిత్తుఁడు నైపల్యసుస్థితుఁ డవుచు
యెఱుఁగఁ జెప్ప సమాధాన మింత యైన
జుటి యెఱుఁగఁ డసమాధాన మార్గ మతఁడు
కానఁ డెప్పుడు హితాహితకల్పనంబు. ౧౮

గీ. నిర్మమత్వయుతుం డయి నిశ్చలుఁ డయి
నిత్యనిరహంక్రియా వినిర్నిద్రుఁ డగుచు
జ్ఞాని సర్వాశలను నాత్మలోనె పాసి
చేసి చేయని వాఁ డయి వాసి గాంచు. ౧౯

గీ. నిజమనోద్భూత సమ్మోహ నియత స్వప్న
జాడ్య సంవర్జితుం డయి జ్ఞాని గాంచు
గలిత మానస దివ్య సంకలనఁ దనరి
యద్వితీయ దశాప్రాప్తి నహరహంబు. ౨౦

---

# అష్టావక్రసంహితా

## అష్టాదశోఽధ్యాయః

### శాంతిశతక ప్రకరణమ్

అష్టావక్ర ఉవాచః—

యస్య బోధోదయే తావత్ స్వప్నవద్భవతి భ్రమః,
తస్మై సుఖైకరూపాయ నమః శాంతాయ తేజసే. ౧

ఏబోధము కలుగఁగానే భ్రమ లన్నియుం నశించిపోవునో, యేది సుఖైకరూపమో, యేది శాంతము తేజస్వంతమునో దానికి నమస్కరింతును.

అర్జయిత్వాఽఖిలానర్థాన్ భోగానాప్నోతి పుష్కలాన్,
న హి సర్వపరిత్యాగమంతరేణ సుఖీ భవేత్. ౨

అఖిలార్థముల నార్జించి పుష్కలముగ సుఖముల ననుభవించినను తుదకు సర్వపరిత్యాగమునఁ గాని సుఖము కలుగదు.

కర్తవ్యదుఃఖమార్తాండజ్వాలాదగ్ధాంతరాత్మనః,
కుతః ప్రశమపీయూషధారాసారామృతే సుఖమ్. 3

కర్తవ్యదుఃఖ మనుసూర్యాతపముచే దగ్ధ మగుమనసు గలవానికి, ప్రశాంతి యనునమృతధారాపాతమునఁ గాని సుఖము లభింపదు.

భవోఽయం భావనామాత్రో న కించిత్ పరమార్థతః,
నాస్త్యభావః స్వభావానాం భావాభావవిభావినామ్. ౪

విశ్వము భావనామాత్రమే కాని, నిజమున కది కించిత్తును గాదు, కాని స్వభావసిద్ధ మగునాత్మ భావాభావముల నందియుం నసత్యము గాదు.

# అష్టావక్ర సంహిత

## అష్టాదశాధ్యాయము

### శాంతిశతక ప్రకరణము

అష్టావక్రుడు:—

గీ. ఏప్రబోధోదయంబున నెల్లభ్రమలు
స్వప్నమాత్రము లై పోవు క్షణములోన
నెది సుఖైకరూపంబు? నెయ్యది ప్రశాంత
సత్య తేజంబు దాని కంజలి ఘటింతు. ౧

గీ. సర్వసంపత్సమృద్ధియు సర్వభోగ
వితతి నందియు మనుజుఁ డేవేళఁ గాని
సర్వసంత్యాగమునఁ గాని సౌఖ్యలేశ
మెఱుఁగనే లేఁడు నిశ్చయ మిది తలంప. ౨

గీ. తలఁపఁ గర్తవ్యదుఃఖమార్తాండ తీవ్ర
కరవిదగ్ధాంతరాత్మున కరయ సుఖము
ప్రశమపీయూషధారా ప్రవాహమున నె
కాక కలుగునె యన్యమార్గంబువలన? 3

గీ. భావనామాత్రమే యగు భవము; కాని
కాదు కించిత్తుఁగూడను గణనసేయ
నే స్వభావాత్మ కనుచుండి యొసఁగు భావ
మును నభావము నది యుండు నహరహంబు. ౪

న దూరం న చ సంకోచాల్లబ్ధమేవాత్మనః పదమ్,
నిర్వికల్పం నిరాయాసం నిర్వికారం నిరంజనమ్. ౫

నిర్వికల్పము, నిరాయాసము, నిర్వికారము, నిరంజనము నగు నాత్మ పదము దూరమును గాదు; సంగదోషమున లభించునదియుఁ గాదు.

వ్యామోహమాత్రవిరతౌ స్వరూపాదానమాత్రతః,
వీతశోకా విరాజంతే నిరావరణదృష్టయః. ౬

వ్యామోహమాత్ర నాశనము, స్వరూపదర్శనము నైనవెంటనే దృష్టి యావరణము లేనిదై దుఃఖములు నశింప సుఖము గలుగును.

సమస్తం కల్పనామాత్రమాత్మా ముక్తః సనాతనః,
ఇతి విజ్ఞాయ ధీరో హి కిమభ్యస్యతి బాలవత్. ౭

సమస్తము కల్పనామాత్ర మనియు నాత్మ ముక్తము సనాతన మనియుం దెలిసిన ధీరుఁడు, అజ్ఞాని యగు బాలునివలె సంచరించునా ?

ఆత్మా బ్రహ్మేతి నిశ్చిత్య భావాభావౌ చ కల్పితౌ,
నిష్కామః కిం విజానాతి కిం బ్రూతే చ కరోతి కిమ్. ౮

ఆత్మయే బ్రహ్మ మనియు భావాభావములు కల్పితము లనియుం నిశ్చయించిన నిష్కామి యేమి తెలియవలయు, నేమిపలుకు నేమి చేయును ?

అయం సోఽహమయం నాహమితి క్షీణా వికల్పనాః,
సర్వమాత్మేతి నిశ్చిత్య తూష్ణీంభూతస్య యోగినః. ౯

సర్వ మాత్మయే యని నిశ్చయించి తూష్ణీంభూతుఁ డగుయోగికి "నే నిది" "నే నిది కాను" అనువూహలు క్షీణించిపోవును.

న విక్షేపో న చైకాగ్ర్యం నాతిబోధో న మూఢతా,
న సుఖం న చ వా దుఃఖముపశాంతస్య యోగినః. ౧౦

ఉపశాంతి గన్న యోగపురుషునకు విక్షేపమే లేదు. ఏకాగ్రత లేదు. అతిబోధ ముండదు, మూఢత లేదు, సుఖము కాని దుఃఖము కాని లేవు.

గీ. నిర్వికల్ప నిరాయాస నిర్వికార
ఘన నిరంజన మగు నాత్మ ఘన పదంబు
దూర మెన్నఁడుఁ గాదు; విదూరము నగుఁ
బరమమానస సంగ దుర్భరము కతన. ౫

గీ. ఎవఁడు వ్యాఘమోహరహితుఁడై యొరక మెరఁగు
స్వస్వరూపదర్శనము నొప్పారఁ గాంచు
నావరిష్ఠుని దృష్టి నిరావరణము
నతఁడు రాజిలు నిజదుఃఖ వితతిఁ బాసి. ౬

గీ. సర్వమును గల్పనామాత్ర ముర్వియందు
నాత్మ ముక్తము శాశ్వత మనియుఁ దెలియు
జ్ఞానవంతుఁడు బాలుని సరణి నేల
యెన్నఁ డైనను జరియించునే తలంప? ౭

గీ. ఆత్మయే బ్రహ్మ మనునిశ్చయంబు గలిగి
భావము నభావమును జూడఁ బరమకల్పి
తము లని యెఱుంగు నిష్కామధనుఁ డెన్నఁ
బలుకఁ జేయ నెఱింగెడు పనులు గలవె? ౮

గీ. సర్వ మాత్మగా నెఱుఁగు విజ్ఞానశాలి
యన్నిపనులఁ దూష్ణీం భూతుఁ డగుట కతన
'ఇది నిజంబుగ నేను,' 'గా నిదియు నేను'
ననెడి పలుకులు యోగివర్యునకు లేవు. ౯

గీ. ఒనర నుపశాంతి గన్నట్టియోగి కరయ
లేదు విక్షేప మన్నది లేదు ధ్యాన
ము నతి బోధయు మౌఢ్యముఁ గనము మఱియు
సౌఖ్యమును లేదు దుఃఖభాజనత లేదు. ౧౦

స్వారాజ్యే భైక్షవృత్తౌ చ లాభాలాభే జనే వనే,
నిర్వికల్పస్వభావస్య న విశేషోఽస్తి యోగినః. ౧౧

వికల్పము లేనిస్వభావము గలయోగివరునకు స్వర్గరాజ్యము, భిక్షుక వృత్తియుం, లాభాలాభములు, జనవనములు, నన్నియుం సమానమే.

క్వ ధర్మః క్వ చ వా కామః క్వ చార్థః క్వ వివేకితా,
ఇదం కృత మిదం నేతి ద్వంద్వైర్ముక్తస్య యోగినః. ౧౨

'ఇది చేయఁబడినది' 'ఇది చేయఁబడ లేదు' అనుద్వంద్వముల కతీతుఁడైనయోగికి ధర్మార్థకామములు, వివేకము నాతనికి లెక్కయే కావు.

కృత్యం కిమపి నైవాస్తి న కాపి హృది రంజనా,
యథా జీవనమేవేహ జీవన్ముక్తస్య యోగినః. ౧౩

జీవన్ముక్తుఁ డగుయోగికి హృదయమునఁ గర్తవ్యము కాని సంగత్వము కాని లేవు. జగమున నాతనిపనులు బ్రతుకుటమాత్రమే యగును.

క్వ మోహః క్వ చ వా విశ్వం క్వ తద్ధ్యానం క్వ ముక్తతా,
సర్వసంకల్పసీమాయాం విశ్రాంతస్య మహాత్మనః. ౧౪

సర్వసంకల్పములు వీడినమహాత్మునకు మోహము, విశ్వము, ధ్యానము, ముక్తత యేమియుం నుండవు.

యేన విశ్వమిదం దృష్టం స నాస్తీతి కరోతు వై,
నిర్వాసనః కిం కురుతే పశ్యన్నపి న పశ్యతి. ౧౫

విశ్వమును గాంచువాఁడు విశ్వము లే దనుటకుఁ బ్రయత్నించును. వాసనాహీనుఁ డేమి చేయును? ఆతఁడు చూచి చూడనివాఁ డగును.

యేన దృష్టం పరం బ్రహ్మ సోఽహం బ్రహ్మేతి చింతయేత్,
కిం చింతయతి నిశ్చింతో ద్వితీయం యో న పశ్యతి. ౧౬

పరబ్రహ్మమును గన్నవాఁడు 'నేనే బ్రహ్మము' నని చింతించును. ఆత్మ యగుతాను దక్క నన్యమునే గననినిశ్చింతుఁ డేమి చింతించును?

గీ. స్వర్గ రాజ్యంబు నైన భిక్షంబు నైన
లాభ మైనను నష్టోప లబ్ధి యైన
జనపదం బైన వన మైన సమమె చూడ
నిర్వికల్పుఁ డౌ యోగ వినిర్మలునకు. ౧౧

గీ. ద్వంద్వనిర్ముక్తుఁ డౌ యోగివరున కరయ
నిది కృతం బిది యకృత మన్నదియుఁ గలదె?
ఎచట ధర్మంబు గలదు? వే తెచటఁ గామ
ముండును? వివేకితార్థంబు లుండు నెచట? ౧౨

గీ. అఖిలబుద్ధి జీవన్ముక్తుఁ డైన యోగి
కాచరింపఁగ నైన కృత్యములు గలవె?
హృదయ మది బద్ధ మగునె యెయ్యెడలఁ గాని
యతనిధర్మము బ్రతుకుటే యగును జూడ. ౧౩

గీ. సర్వసంకల్పతేర భాస్వత్ప్రదేశ
మందు విశ్రాంతి నందు మహాత్మునకును
మోహ మెచ్చట నుండు నేమూలనుండు
విశ్వమును ధ్యానమును ముక్తివిధముఁ జూడ. ౧౪

గీ. విశ్వ మన్నది చూచిన వెనుకఁ గాదె
దాని మిథ్యాత్వమును జూడఁ దలఁచు నరుఁడు
చూచుచున్నను నిజముగాఁ జూడనట్టి
వాసనాహీనుఁ డేమి సల్పంగవలయు? ౧౫

గీ. ఘనపరంబ్రహ్మమును జూడఁ గనినయతఁడు
చింతచేయు 'సోఽహం బ్రహ్మ' చింతఁ దగిలి
ధ్యానము గనన ట్టి నిశ్చింత పరమపురుషుఁ
డేది యూహించి చింతింప నెంచు మదిని? ౧౬

దృష్టో యేనాత్మవిక్షేపో నిరోధం కురుతే త్వసౌ,
ఉదారస్తు న విక్షిప్తః సాధ్యాభావాత్కరోతి కిమ్. ౧౭

తనలో విక్షేపమును గనునతఁడు నిజముగాఁ దన్ను నిరోధించుకొనఁ బ్రయత్నించును. ఉదారునకు విక్షేపమే లేదు. సాధింపవలసినది లేని కతఁ డేమి చేయును?

ధీరో లోకవిపర్యస్తో వర్తమానోఽపి లోకవత్,
న సమాధిం న విక్షేపం న లేపం స్వస్య పశ్యతి. ౧౮

ధీరుఁ డగుజ్ఞాని లోకమానవునివలె నున్నను నాతనిఁ బోలఁడు. జ్ఞానికి సమాధి, విక్షేపము, లేపము నేమియు లేవు.

భావాభావవిహీనో యస్తృప్తో నిర్వాసనో బుధః,
నైవ కించిత్ కృతం తేన లోకదృష్ట్యా వికుర్వతా. ౧౯

భావాభావములు లేనివాఁడు, నిత్యతృప్తుఁడు, నిర్వాసనుఁడు, నగు బుధుఁడు లోకదృష్టిలోఁ జేయువానివలెఁ గానవైనను నేమియుఁ జేయఁడు.

ప్రవృత్తౌ వా నివృత్తౌ వా నైవ ధీరస్య దుర్గ్రహః,
యదా యత్కర్తుమాయాతి తత్కృత్వా తిష్ఠతః సుఖమ్.

జ్ఞాని యగుధీరుఁడు చేయఁబడునది చేయుచు సుఖముండి ప్రవృత్తి నివృత్తులలో దేనికిని బాధపడఁడు.

నిర్వాసనో నిరాలంబః స్వచ్ఛందో ముక్తబంధనః,
క్షిప్తః సంస్కారవాతేన చేష్టతే శుష్కపర్ణవత్. ౨౧

సంస్కారము లనువాయువుచే నెగురఁగొట్టఁబడి నిష్కామి, నిరాలంబి స్వచ్ఛందుఁడు, బంధముక్తుఁడు నగువాఁడు జీర్ణపత్రమువలె నెగురును.

అసంసారస్య తు క్వాపి న హర్షో న విషాదితా,
స శీతలమనా నిత్యం విదేహ ఇవ రాజతే. ౨౨

గీ. ఆత్మ విక్షేపమును గాంచునతఁడు తాను
తన్నిరోధంబునకుఁ బాటుపడఁ గడంగు
నాత్మ విక్షేపమే లేనియట్టి ఘనుఁడు
సాధ్యమే లేనివాఁ డేమి సలుపవలయు ? ౧౭

గీ. లోకమానవురీతి నాలోకనముసఁ
గానవయ్యును ధీరుఁడు కాఁడు జూడ
ఘనసమాధి విక్షేపముల్ గాంచఁ డతఁడు
నిజవిలేపంబుఁ గానంగనేర కుండు. ౧౮

గీ. భావము నభావమును లేని పరమబుధుఁడు
నిత్యతృప్తుఁడు వాసనానిర్జితుండు
లోకదృష్టిని గర్తవ్యలోలుఁ డయ్యు
నాత్మదృష్టి నకర్తయే యగు నిజంబు. ౧౯

గీ. చేయఁబడఁగాఁ దగిన దెల్లఁ జేయుచుండి
నిత్యసౌఖ్యము నందు నిర్నిద్రుఁ డగుచు
తనరు ధీరునకుఁ బ్రవృత్తి యనియు మఱి ని
వృత్తి యనియును గల్గునే వేదనంబు. ౨౦

గీ. వాసనాహీనుఁ డాలంబవర్జితుండు
ముక్తబంధనస్వచ్ఛందపురుషుఁ డెందు
నమలసంస్కారవాతూలహతిని శుష్క
పర్ణమును బోలి వర్తించి ప్రభుతఁ గాంచు. ౨౧

గీ. భయదసంసారరహిత సంపత్ప్రభుండు
నెపుడు హర్షవిషాదంబు లెఱుఁగకుండు

సంసారస్థితి నతిక్రమించినవానికి హర్షవిషాదము లుండవు. ప్రశాంత మనస్కుఁడై యట్టివాఁడు దేహముండి లేనట్లే చరించును.

కుత్రాపి న జిహాసాస్తి నాశో వాపి న కుత్రచిత్,
ఆత్మారామస్య ధీరస్య శీతలాచ్ఛతరాత్మనః. ౨౩

ఆత్మయందే రమించుధీరుఁడు ప్రశాంతస్వచ్ఛమనస్కుఁడై యేవస్తువును విడువఁగోరిక కాని, యేదైన నష్టమాయె నని తలఁపు గాని లేకుండును.

ప్రకృత్యా శూన్యచిత్తస్య కుర్వతోఽస్య యదృచ్ఛయా,
ప్రాకృతస్యేవ ధీరస్య న మానో నావమానతా. ౨౪

సహజముగా శూన్యచిత్తుఁడై యథేచ్ఛముగా వర్తించునాతఁడు ప్రాకృతజనునివలె మానావమానములకుఁ జలింపఁడు.

కృతం దేహేన కర్మేదం న మయా శుద్ధరూపిణా,
ఇతి చింతానురోధీ యః కుర్వన్నపి కరోతి న. ౨౫

ఇది నాదేహముచేఁ జేయఁబడినదే కాని శుద్ధరూపుఁడ నగునాచేఁ గా దని యేపనియెడనైన నెంచువాఁ డేపనిఁ జేసినను చేయనివాఁడే.

అతద్వాదీవ కురుతే న భవేదపి బాలిశః,
జీవన్ముక్తః సుఖీ శ్రీమాన్ సంసరన్నపి శోభతే. ౨౬

జీవన్ముక్తుఁడు 'నే నీప్రకారము చేయుచున్నా' నని చెప్పనివానివలెఁ బ్రవర్తించినను నాతఁడు బాలిశుఁడు కాఁజాలఁడు. సంసారిగా నున్న నాతఁడు సుఖవంతుఁడు, శ్రీమంతుఁడే.

నానావిచారసుశ్రాంతో ధీరో విశ్రాంతిమాగతః,
న కల్పతే న జానాతి న శృణోతి న పశ్యతి. ౨౭

వివిధము లగునాలోచనములు మాని మనోవిశ్రాంతి నందుధీరపురుషుఁడు చేనినిగుఱించియుఁ జింతింపఁడు. ఏదియుఁ గనఁడు, వినఁడు, చూడఁడు.

అసమాధేరవిక్షేపాన్న ముముక్షుర్న చేతరః,
నిశ్చిత్య కల్పితం పశ్యన్ బ్రహ్మైవాస్తే మహాశయః. ౨౮

సమలశాంతాత్మకం బగుసంతరంగ
మమర సతము విదేహసౌఖ్యమున మనును. ౨౨

గీ. ఏమహాత్ముఁ డాత్మారాముఁడై మఱియును
ధీరుఁడై శీతలస్వచ్ఛధీవరుఁ డయి
యుండు నతనికిఁ ద్యాజ్య మే ముండు? వలఁప
నేది నశియించు ననుచింత యెటులఁ గలుగు? ౨౩

గీ. ప్రకృతిచేతనె శూన్యాంతరంగుఁ డగుటఁ
నా యథేచ్ఛను వర్తించుతత్త్వవేత్త
పాటకపుమానవునిరీతి బాధపడునె
తాను మానావమానసక్తప్రబుద్ధి. ౨౪

గీ. 'దేహకృత మైనకర్మ మిది' యని తెలిసి
'పరమశుద్ధస్వరూపుఁడఁ బను లొనర్ప'
ననెడు చింతానువర్తి యానతఁడు పనులు
చేసి చేయనివాఁడుగాఁ జెప్పఁబడును. ౨౫

గీ. 'ఇట్టు లొనరింతు' నని చెప్పనట్టివాని
వలెనె వర్తించినను గాఁడు బాలిశుండు
సుఖియు శ్రీమంతుఁడై యొప్పుచుండు నెపుడు
భవమునందు జీవన్ముక్తుఁ డవుటవలన. ౨౬

గీ. జ్ఞాని నానావిచారసుశ్రాంతుఁ డగుట
ధీరుఁడై శ్రాంతి నందినవీరుఁ డగుట
నేదియును జింతసేయఁడు నెఱుఁగఁ డెదియు
వినఁడు చూడఁడు కనఁడు నేవియునుగూడ. ౨౭

గీ. కన సమాధియు విక్షేపకమును లేక
శాంతిఁగొనఁడు ముముక్షుతఁ గనఁ డితరము

సమాధి, విక్షేపముల కతీతుఁ డైనమహాశయుఁడు ముముక్షుత్వమును గోరఁడు. ఇతరమును గోరఁడు. విశ్వము కల్పిత మని నిశ్చయించి దానిని గను చున్న వాఁడు బ్రహ్మస్వరూపి యైయే యుండును.

యస్యాన్తః స్యా దహంకారో న కరోతి కరోతి సః,
నిరహంకార ధీరేణ న కించిదకృతం కృతమ్. ౨౯

అహంకారము గలవాఁ డేమిచేయకపోయినను జేసినవాఁడే యగును. నిరహంకారుఁ డగుధీరుఁడుమాత్రము చేయరానిది చేయనే చేయఁడు.

నోద్విగ్నం న చ సంతుష్టమకర్తృ స్పందవర్జితమ్,
నిరాశం గతసందేహం చిత్తం ముక్తస్య రాజతే. 3౦

ముక్తునిమనస్సు ఉద్విగ్నముఁగాదు సంతుష్టముఁగాదు. అది యస్పందము, నిరాశము, గతసందేహమునై యొప్పారును.

నిర్ధ్యాతుం చేష్టితం వాపి యచ్చిత్తం న ప్రవర్తతే,
నిర్నిమిత్తమిదం కింతు నిర్ధ్యాయతి విచేష్టతే. 3౧

ముక్తునిమనస్సు ధ్యానమునకుఁ జేష్టలను మిక్కిలిఁ బ్రవర్తింపదు; కాని నిర్నిమిత్తముగానే ధ్యానించును, చేష్టించును.

తత్త్వం యథార్థమాకర్ణ్య మందః ప్రాప్నోతి మూఢతామ్,
అథవాయాతి సంకోచమమూఢః కోఽపి మూఢవత్. 3౨

యథార్థతత్త్వ మాకర్ణించియు మందబుద్ధి మూఢుఁ డగును. కాని, బుద్ధిమంతుఁ డది విని మూఢునివలె నున్నను సంకోచము నందును.

ఏకాగ్రతా నిరోధో వా మూఢైరభ్యస్యతే భృశమ్,
ధీరాః కృత్యం న పశ్యంతి సుప్తవత్ స్వపదే స్థితాః. 33

మూఢులగువారే యేకాగ్రత నిరోధము మనస్సునకుఁ గలుగుట కొఱకై యభ్యసింతురు. ధీరులు ఆత్మపదస్థితులై సుప్తులవలెఁ జేయవలసినదే లేకుందురు.

చూచు విశ్వము కల్పితసూత్ర మనుచు
బ్రహ్మసంవర్తనంబునఁ బరగుజ్ఞాని. ౨౮

గీ. మనములోన నహంకార మినుమడింపఁ
జేయకున్నను జేసినచేత యగును
తద్వివర్జితధీరతత్త్వజ్ఞుఁ డరయఁ
జేయఁగారాని దెన్నఁడుఁ జేయకుండు. ౨౯

గీ. నిరత ముద్విగ్నసంతుష్టు లరయ కుండుఁ
బనికర్తయు స్పందవివర్జితంబు
వీత దేహాన్నై రాశ్యవిహిత మగుచుఁ
గాన నగు ముక్తమానవుమానసంబు. ౩౦

గీ. ధ్యానచేష్టలయందు వర్తనముఁ గనియు
ముక్తమానస మంద దెప్పుడు శ్రమంబు
నిర్నిమిత్తమై ధ్యానము నిర్నిమిత్త
మరయఁ జేష్టలు గలిగిసౌఖ్యమున నుండు. ౩౧

గీ. తత్త్వయాథార్థ్యమున్ విని తాను మంద
బుద్ధి కాంచును మౌఢ్యము మూర్ఖుఁ డగుట
మూఢురీతి నొకప్పుడు ముగ్ధుఁ డగును
యోగియును నాత్మసంకోచ మొందుకతన. ౩౨

గీ. పరమమార్గుఁడు యత్నించుఁ బ్రతిదినంబుఁ
దనకు నేకాగ్రనిరోధములు గలుగఁ
బరమవిజ్ఞాని స్వపదసంపత్తి నతుండు
సుప్తువలెఁ జేయఁ దేమియుఁ జోద్యమిదియ. ౩౩

అప్రయత్నాత్ ప్రయత్నాద్వా మూఢో నాప్నోతి నిర్వృతిమ్
తత్త్వనిశ్చయమాత్రేణ ప్రాజ్ఞో భవతి నిర్వృతః. ౩౪

మూఢులు ప్రయత్నముచేఁగాని యప్రయత్నముచేఁగాని నిర్వృతిఁగన లేరు. ప్రాజ్ఞుఁడుమాత్రము తత్త్వనిశ్చయము కలిగినంతనే నిర్వృతినందును.

శుద్ధం బుద్ధం ప్రియం పూర్ణం నిష్ప్రపంచం నిరామయమ్,
ఆత్మానం తం న జానంతి తత్రాభ్యాసపరా జనాః. ౩౫

శుద్ధము, బుద్ధము, ప్రియము, పూర్ణము, నిష్ప్రపంచము, నిరామయము నగునాత్మపదార్థమును దదభ్యాసపరులునైత మెఱుఁగనే యెఱుంగరు.

నాప్నోతి కర్మణా మోక్షం విమూఢోఽభ్యాసరూపిణా,
ధన్యో విజ్ఞానమాత్రేణ ముక్తస్తిష్ఠత్యవిక్రియః. ౩౬

మూఢుఁడు తా నభ్యాసరూపముగాఁ గర్మ చేసినను మోక్ష మందఁడు ధన్యపురుషుఁ డగువాఁడు విజ్ఞానముననే యక్రియుఁడై ముక్తి నందును.

మూఢో నాప్నోతి తద్బ్రహ్మ యతో భవితుమిచ్ఛతి,
అనిచ్ఛన్నపి ధీరో హి పరబ్రహ్మస్వరూపభాక్. ౩౭

మూఢుఁడు బ్రహ్మమును గోరును గాన బ్రహ్మము నందలేఁడు, ధీరుఁడు పరబ్రహ్మస్వరూపమును గుర్తించి కోరకుండనే తా నది యగును.

నిరాధారా గ్రహవ్యగ్రా మూఢాః సంసారపోషకాః,
ఏతస్యానర్థమూలస్య మూలచ్ఛేదః కృతో బుధైః. ౩౮

మూఢుఁ డేయాధారము గనక ముక్తిఁ గోని సంసారి యగుచున్నాఁడు బుధుఁడు సమస్తానర్థమును నగుసంసారమును భేదించివేయుచున్నాఁడు.

న శాంతిం లభతే మూఢో యతః శమితుమిచ్ఛతి,
ధీరస్తత్త్వం వినిశ్చిత్య సర్వదా శాంతమానసః. ౩౯

మూఢుఁడు శాంతి నందఁగోరుచుండును గనకనే దాని నందఁడు. ధీరుఁడుమాత్రము తత్త్వనిశ్చయముచే శాంతినే పొందుచున్నాఁడు.

గీ. యత్నము నయత్న మెప్పు డీయవు సుఖంబు
మూఢమానవునకుఁ; గాని, ముక్తునకును
తత్త్వనిశ్చయమాత్రానఁ దనరుచుండు
నిర్వృతి యనంతమై కడునిశ్చయముగ. ౩౪

గీ. బహువిధాధ్యాత్మశాస్త్రాభ్యాసపరత నున్నఁ
దగ నెఱుంగరు శుద్ధబుద్ధప్రపూర్ణ
నిష్ప్రపంచనిరామయనిలయ మైన
యాత్మరూపంబు జనుల నేమందు వత్స. ౩౫

గీ. ప్రవిమలాభ్యాసరూపకర్మమున కెపుఁడు
మోక్షమే లేదు; ధన్యుఁడు ముక్తి నందుఁ
దనకు నుపలబ్ధ మైనతత్త్వంబువలన
విజ్ఞుఁడై యక్రియుఁడు నయి వెలుఁగుకతన. ౩౬

గీ. బ్రహ్మ మరయంగఁ గోరి మూర్ఖపురుండు
గాంచనే లేఁడు బ్రహ్మంబుఁ; గాని ధీర
పుణ్యపురుషుండు గాంక్షింపఁ బోవ కెపుడుఁ
గనుఁ బరబ్రహ్మరూపవిజ్ఞత క్షణమున. ౩౭

గీ. అతి నిరాధారుఁ డయ్యు మూర్ఖాత్ముఁ డొనర
ముక్తిఁ గోరి సంసార సమ్మోహ మందు;
నయ్యనర్థ కారణము బుణ్యాత్ముఁ డరసి
మూలవిచ్ఛేద మొనరించి ముక్తిఁ గాంచు. ౩౮

గీ. శాంతి వాంఛించు మూఢుఁ డశ్రాంత మగుట
శాంతి లభ్యము కా దెట్టి సమయములను
ధీరుఁ డెన్నఁడుఁ దత్త్వసందీప్తుఁ డగుట
నిత్యశాంతమనస్కుఁడై నెగడుచుండు. ౩౯

క్వాత్మనో దర్శనం తస్య యద్దృష్టమవలంబతే,
ధీరాస్తం తం న పశ్యన్తి పశ్యన్త్యాత్మానమవ్యయమ్. ४०

దృశ్యమానపదార్థ మవలంబనముగాఁ గలవాని కాత్మజ్ఞాన మెట్లుగలుగును ? ధీరపురుషు లిది యది చూడరు. వా రవ్యయ మగునాత్మనే కందురు.

క్వ నిరోధో విమూఢస్య యో నిర్బంధం కరోతి వై,
స్వారామస్యైవ ధీరస్య సర్వదాఽసావకృత్రిమః. ४१

మనోనిర్బంధమునకుఁ బ్రయత్నించు మూఢునకు నిరోధ మేది? ఆత్మారాముఁ డగుధీరునకు సర్వదా సహజముగా నది యుండును.

భావస్య భావకః కశ్చిన్న కించిద్భావకోఽపరః,
ఉభయాభావకః కశ్చిదేవమేవ నిరాకులః. ४२

ఒకఁడు భావ మున్న దని యెంచును. ఇంకొకఁ డేమియుం లే దనును. ఉభయమును జింతింపక నిరాకులుఁ డగువాఁడుమాత్ర మరుదు.

శుద్ధమద్వయమాత్మానం భావయన్తి కుబుద్ధయః,
నతు జానన్తి సమ్మోహాద్యావజ్జీవమనిర్వృతాః. ४३

కుబుద్ధులు ఆత్మశుద్ధ మనియుం నద్వయ మనియుం భావింతురు. కాని, సమ్మోహితు లగుట దానిం గనలేక యావజ్జీవము దుఃఖపడుదురు.

ముముక్షోర్బుద్ధిరాలంబమన్తరేణ న విద్యతే,
నిరాలంబైవ నిష్కామా బుద్ధిర్ముక్తస్య సర్వదా. ४४

ముముక్షువు బుద్ధి నిరాలంబము కాదు. కాని, ముక్తపురుషుని బుద్ధి సదా నిరాలంబము, నిష్కామము నైనది.

విషయద్వీపినో వీక్ష్య చకితాః శరణార్థినః,
విశన్తి ఝటితి క్రోడం నిరోధైకాగ్ర్యసిద్ధయే. ४५

విషయ వ్యాఘ్రములను గాంచి చకితులు శరణార్థులై మనోనిరోధము, ఏకాగ్రత లను గుహాలలో వెంటనే దాఁగుకొందురు.

గీ. దృష్ట మవలంబనంబుగ నెంచు నతని
కెచట గోచర మగు బ్రహ్మారుచిరవిద్య
ధీరుఁ డిటు చూడ నొల్లనికారణమున
నరయు నవ్యయ మైనయాత్మానుభూతి. ४०

గీ. తా నిరోధింప యత్నించువాని మూర్ఖుఁ
డెట్లు నిర్బంధ మొనరించి యొసఁగఁగలఁడు ?
ధీరవర్యుఁ డాత్మారాముఁ డై రమించు
నిత్య సహజ నిరోధిత నియతబుద్ధి. ४೧

గీ. భావభావకుఁడై యుండి పరఁగు నొకఁడు
ఒకఁ డకించిత్ప్రభావుఁడై యుండుఁ గాని
యుభయమును జింత చేయని ప్రభువు లేఁడు
అతి నిరాకుల సతతపుణ్యాత్ముఁ డరుదు. ४౨

గీ. శుద్ధ మద్వయ మాత్మ యంచును దలంచి
ప్రబలసమ్మోహ మునువలఁ బడినకతన
నెఱుఁగలేరు కుబుద్ధు లా టెందువలన
జన్మ మంతయు దుఃఖితస్వాంతు లగుచు. ४३

గీ. ముక్తి వాంఛించువాని దౌబుద్ధి సతముఁ
గన నిరాలంబనం బయ్యె క్రాల లేదు ;
ముక్తపురుషునిబుద్ధి యెప్పుడునుగూడఁ
దా నిరాలంబనిష్కామ మైన దగును. ४४

గీ. విషయపుంబులులం గాంచి విహ్వాలు లయి
చకిత జను లెల్ల శరణిచ్చు జనులకొఱకుఁ
జిరనిరోధ హృదేకాగ్ర సిద్ధి గుహలఁ
ద్వరితముగఁ బోయి దాఁగుకొందురు ప్రయాస. ४५

నిర్వాసనం హరిం దృష్ట్వా తూష్ణీం విషయదంతినః,
పలాయంతే న శక్తాస్తే సేవంతే కృతచాటవః. ౪౬

వాసనాహీనుఁడగు (నర) హరిని గాంచినంతనే విషయము లను నేనుఁగులు పాఱిపోవును. అందుకు శక్తి లేనిచో స్తుతించుచు సేవించును.

న ముక్తికారికాం ధత్తే నిశ్శంకో యుక్తమానసః,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్నాస్తే యథాసుఖమ్.

శంకారహితము, సాత్మలీనము నగుమనస్సు గలవాఁడు ముక్తిమార్గముల నరయఁడు. చూచుచు వినుచు, ముట్టుచు, వాసనచూచుచుఁ దినుచు సుఖించును.

వస్తుశ్రవణమాత్రేణ శుద్ధబుద్ధిర్నిరాకులః,
నైవాచారమనాచారమౌదాస్యం వా ప్రపశ్యతి. ౪౮

ఎవనిమనస్సు తత్త్వము విన్నంతనే శుద్ధమై, నిరాకులమైనదో, యామనస్సు ఆచారానాచారములను, ఔదాసీన్యమును గననేరదు.

యదా యత్కర్తుమాయాతి తదా తత్కురుతే ఋజుః,
శుభం వాప్యశుభం వాపి తస్య చేష్టా హి బాలవత్. ౪౯

ఋజుప్రవర్తన గలవాఁడు చేయబడవలసినదని శుభాశుభములలో నేదైనను జేయును. ఏలన, నాతని చేష్టలు బాల్యచేష్టల వంటివి.

స్వాతంత్ర్యాత్ సుఖమాప్నోతి స్వాతంత్ర్యాల్లభతే పరమ్,
స్వాతంత్ర్యాన్నిర్వృతింగచ్ఛేత్ స్వాతంత్ర్యాత్ పరమంపదమ్.

స్వాతంత్ర్యమువలననే సుఖము లభించును. స్వేచ్ఛవల్లనే పరము లభించును. స్వతంత్రతచేతనే నిర్వృతి గలుగును. స్వేచ్ఛవల్లనే పరమపదము.

అకర్తృత్వమభోక్తృత్వమ్ స్వాత్మనో మన్యతే యదా,
తదా క్షీణా భవన్త్యేవ సమస్తాశ్చిత్తవృత్తయః. ౫౧

గీ. వాసనాహీనమానవప్రవరహారిని
విషయదంతులు గని పాఱు భీతితోడఁ
బాఱిపోవుటకును శక్తి వడయకున్నఁ
జేరి స్తుతియించి యొనరించు సేవ లెల్ల. ౪౬

గీ. మహితనిశ్చింతుఁడై యుక్తమానసుఁ డగు
సుకృతి వెదకఁడు ముక్తికారికలకొఱకుఁ
గనుచు వినుచును ముట్టుచు ఘ్రాణ మొనరఁ
జేయుచును దించు సుఖమందు స్థిరతరముగ. ౪౭

గీ. తత్త్వవస్తు సుశ్రవణమాత్రమున నెవని
బుద్ధి శుద్ధ నిరాకులమున వెలుంగు
నతఁ డనాచార మాచార మనుటఁ గనఁడు
మఱియు నౌదాస్యమును గాంచి మసలకుండు. ౪౮

గీ. ఋజుత నొప్పారు మానవాకృతమహర్షి
శుభము నశుభంబుఁ గననట్టి శుద్ధబుద్ధి
యేవి యొనరింపఁ బడవలె నెల్లవానిఁ
జేయు నతఁడు బాలునివలెఁ జెలగుచుంట. ౪౯

గీ. సుఖము లభియించు స్వాతంత్ర్య సూత్రముననె
పరము లభియించు స్వాతంత్ర్య భావముననె
వచ్చు నిర్వృతి స్వాతంత్ర్య వరము కతనఁ
బరమపదమును స్వాతంత్ర్య పరము నిజము. ౫౦

గీ. ఎవఁడు హృదయాంతరంబున నెపు డెఱుంగుఁ
దలఁపఁ గర్తృత్వభోక్తృత్వములును లేమిఁ

ఎప్రుడు నరుఁడు తాను కర్తకాఁ డనియుం భోక్త కాఁ డనియుం గ్రహించి వర్తించునో యపుడే యాతనిచిత్తవృత్తు లన్నియుం క్షీణించిన వగును.

అచ్ఛృంఖలాప్యకృతికా స్థితిర్ధీరస్య రాజతే,
నతు సస్పృహచిత్తస్య శాంతిర్మూఢస్య కృత్రిమా. ౫౨

ధీరునియొక్క స్థితి విశృంఖలమైనను నకృత్రిమమైనను బ్రకాశించును. కాని మూఢునిస్థితి మమకారబద్ధమై కృత్రిమశాంతికల దగుటఁ బ్రకాశింపదు.

విలసంతి మహాభోగైర్విశంతి గిరిగహ్వరాన్,
నిరస్తకల్పనా ధీరా అబద్ధా ముక్తబుద్ధయః. ౫౩

కల్పనములు పూర్తిగా విడిచినబుద్ధిమంతులు బద్ధము కాని ముక్తబుద్ధి కలవా రగుట మహాభోగముల నొకప్పు డనుభవింతురు. ఒకప్పుడు గిరి గహ్వరముల విశ్రాంతి నొందుదురు.

శ్రోత్రియం దేవతాం తీర్థమంగనాం భూపతిం ప్రియమ్,
దృష్ట్వా సంపూజ్య ధీరస్య న కాపి హృది వాసనా. ౫౪

ధీరపురుషుఁడు శ్రోత్రియుని, దేవతను, తీర్థమును, స్త్రీని, రాజును, ప్రియుని గనినను గని గౌరవించినను మనమున నేమాత్రము మమతఁ గనఁడు.

భృత్యైః పుత్రైః కలత్రైశ్చ దౌహిత్రైశ్చాపి గోత్రజైః,
విహస్య ధిక్కృతో యోగీ న యాతి వికృతిం మనాక్. ౫౫

భృత్య, పుత్ర, కళత్ర, దౌహిత్ర, గోత్రజులచే ధిక్కరింపఁబడినను విడువఁబడినను యోగి మనమునఁ గొంచెమైనఁ గించపడఁడు.

సంతుష్టోఽపి న సంతుష్టః ఖిన్నోఽపి న చ ఖిద్యతే,
తస్యాశ్చర్యదశాం తాం తాం తాదృశా ఏవ జానతే. ౫౬

దనర నప్పుడె సకలచిత్తప్రవృత్తు
లంతరించును వెనువెంట వింతగొలుప. ౫౧

గీ. ధీవరేణ్యుని సుస్థితి దీప్త మగును
ఘనవిశృంఖలాకృత్రిమగతుల నున్నఁ
గాని సస్పృహ చిత్తుని మానసంబు
కృత్రిమప్రశాంతి వెలుఁగ దొక్కింతయైన. ౫౨

గీ. ముక్తబుద్ధు లబద్ధులో పురుషవరులు
ధీరులు నిరస్తకల్పనావీరు లగుటఁ
గందు రొకట మహాభోగకలితవృత్తి
నొకట గిరిగహ్వరంబుల నుండ్రు విరతి. ౫౩

గీ. శ్రోత్రియుని దేవతామూర్తి సుమనిభాంగి
దీక్షమును భూపతిని ప్రియు దివ్యరీతిఁ
గాంచి పూజించియును గూడఁ గాంచఁ డెపుడు
ధీరవరుఁ డాత్మవాసనాతృణము నైన. ౫౪

గీ. ఆత్మమానసమున నించుకైనవికృతి
నందఁజాలఁడు యోగమహర్షి చూడ
భృత్యపుత్రకళత్రదౌహిత్త్రులైన
గోత్రజాలునైన నిందించి క్షోభపెట్ట. ౫౫

గీ. తుష్టుఁ డయ్యును యోగి సంతుష్టిఁ గనఁడు
ఖిన్నుఁ డయ్యు నఖిన్నుఁడై కీర్తి గనును

యోగి సంతుష్టుఁ డయ్యు నసంతుష్టుఁడు, ఖిన్నుఁ డయ్యు ఖిన్నుఁడుఁ గానివాఁడును. ఆ మహాత్ముని యాశ్చర్యదశ లంతవానికే గాని యొరులకుఁ దెలియరావు.

కర్తవ్యతైవ సంసారో న తాం పశ్యంతి సూరయః,
శూన్యాకారా నిరాకారా నిర్వికారా నిరామయాః. ౫౭

కర్తవ్య మనునది నిజముగా సంసారసంబంధి. శూన్యాకార, నిరాకార నిర్వికార నిరామయు లగుబుద్ధిమంతులు దీనిఁ గనరు.

అకుర్వన్నపి సంక్షోభాత్ వ్యగ్రః సర్వత్ర మూఢధీః,
కుర్వన్నపి తు కృత్యాని కుశలోహి నిరాకులః. ౫౮

మూఢబుద్ధి యేమియుం నొనరింపకున్నను సంక్షోభ వ్యగ్రుఁ డగును. కుశలబుద్ధి కృత్యము లొనరించుచున్నను నిరాకులుఁ డగును.

సుఖమాస్తే సుఖం శేతే సుఖమాయాతి యాతిచ,
సుఖంవక్తి సుఖం భుంక్తే వ్యవహారేఽపి శాంతధీః. ౫౯

శాంతబుద్ధి వ్యవహారము లందుసైతము సుఖముగాఁ గూర్చుండును. సుఖముగా నిద్రించును, సుఖముగా సంచరించును, సుఖముగా మాట్లాడును. సుఖముగా భుజించును.

స్వభావాద్యస్య నైవార్తిర్లోకవత్ వ్యవహారిణః,
మహాహ్రద ఇవాక్షోభ్యో గతక్లేశః సుశోభతే. ౬౦

జ్ఞాని యాత్మభావముచే వ్యవహారములందుసైతము లోకమానవులవలె నార్తి నందఁడు. అతఁడు గతక్లేశుఁడై మహాహ్రదమువలెఁ గలఁత లేకుండును.

నివృత్తిరపి మూఢస్య ప్రవృత్తిరుపజాయతే,
ప్రవృత్తిరపి ధీరస్య నివృత్తిఫలభాగినీ. ౬౧

మూఢుని నివృత్తి ప్రవృత్తియే యగును. అట్లే, ధీరవరుని ప్రవృత్తి కూడ నివృత్తిఫలమునే యొసఁగుచున్నది.

అతనియాశ్చర్యదశలెల్ల నర్థమగుచు
అతని యంతటి ఘనునకే యచ్చెరువుగ. ౪౬

గీ. అరయఁ గర్తవ్యతయె చూడ నగును ఘోర
సంసరణ; మది బుధులు గాంచరు నిజంబు
నిర్వికార నిరామయ నిర్విశేష
శూన్యరూప నిరాకార సుభగు నగుట. ౪౭
గీ. మూఢబుద్ధులు సంక్షోభములను గందు
రెప్పు డేపనియును జేయకున్నఁ గాని
కుశలబుద్ధులు గనరు సంక్షోభ మెపుడు
నఖిలకార్యము లొనరించునపుడుఁ గూడ. ౪౮
గీ. శాంతియుత మగువ్యవహారచతురబుద్ధి
జ్ఞాని కూర్చుండు సుఖముగాఁ దాను నిద్ర
నందును సుఖంబుఁ జరియించు నభిమతమునఁ
బలుకుఁ భుజియించు సుఖముగాఁ బ్రత్యహంబు. ౪౯

గీ. లౌకికునిరీతి వ్యవహార మాకళించు
చున్నను స్వభావమున నార్తి నొందఁ డెపుడు
జ్ఞాని యక్షోభ్యుఁ డగుమహాహ్రదమురీతి
గతమహాక్లేశుఁడై శోభ గను నతండు. ౫౦

గీ. మూఢులు నివృత్తిమార్గసంపూర్ణులైన
వారిమౌర్ఖ్యమునఁ బ్రవృత్తిఫలమె కలుగు
ధీరులు ప్రవృత్తిమార్గోపదిష్టులైనఁ
బడయఁగలరు నివృత్తిసంపదలఫలము. ౫౧

పరిగ్రహేషు వైరాగ్యం ప్రాయో మూఢస్య దృశ్యతే,
దేహే విగలితాశస్య క్వ రాగః క్వ విరాగతా. ౬౨

మూఢుఁడు తన కున్నదానిపై విరాగము చూపఁదొడఁగును. దేహాభిమానము నశించినమహాత్మునకు రాగవిరాగములు లేవు.

భావనాభావనాసక్తా దృష్టిర్మూఢస్య సర్వదా,
భావ్యభావనయా సా తు స్వస్థస్యాదృష్టిరూపిణీ. ౬౩

మూఢునిదృష్టి యెప్పుడును భావనాభావనములయందు మగ్నమై యుండును. స్వస్థచిత్తుని దృష్టి భావాభావముల నున్నను నుక్తము గాఁ వెలయును.

సర్వారంభేషు నిష్కామో యశ్చరేత్ బాలవన్మునిః,
న లేపస్తస్య శుద్ధస్య క్రియమాణేఽపి కర్మణి. ౬౪

బాలునివలె యోగి సర్వారంభములందు నిష్కాముఁడై యుండుటచే నాతఁడు శుద్ధుఁ డగుట కర్మముల చేయుచున్నను దత్ఫలము నందఁడు.

స ఏవ ధన్య ఆత్మజ్ఞః సర్వభావేషు యస్సమః,
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్నిస్తర్షమానసః. ౬౫

చూచుచున్నను వినుచున్నను ముట్టుచున్నను వాసన చూచుచున్నను తినుచున్నను నిస్తర్షమానసమున సర్వభావములందును వెలుఁగు నాత్మజ్ఞుఁ డాహా యెంత ధన్యుఁడు!

క్వ సంసారః క్వ చాభాసః క్వ సాధ్యం క్వ చ సాధనం
ఆకాశస్యేవ ధీరస్య నిర్వికల్పస్య సర్వదా. ౬౬

ఆకాశమువలె నిత్యనిర్వికల్పస్థితినుండుధీరునకు సంసారము, ఆభాసము సాధ్యము, సాధనము మున్నగున వేయుండును?

స జయత్యర్థసన్న్యాసీ పూర్ణస్వరసవిగ్రహః,
అకృత్రిమోఽనవచ్ఛిన్నః సమాధిర్యస్య వర్తతే. ౬౭

గీ. మూఢుఁ డగువాఁడు నిత్యము భోగ మన్నఁ
ప్రబలవైరాగ్యదృష్టి చూపఁగఁ దొడంగుఁ
బరమదేహాభిమానవివర్జితునకు
రాగము విరాగమును గానరాదు చూడ. ౬౨

గీ. మూఢజనుదృష్టి నిత్యసమ్మోహిత మయి
భావనాభావనాసక్తిఁ బ్రబలుచుండు
స్వస్థచిత్తునిమనమును భావనీయ
ములను నున్నను సంసక్తి యొలయ దెపుడు. ౬౩

గీ. సర్వకార్యములందు నిష్కామబుద్ధి
బాలవత్తుగ వర్తించు బ్రహ్మవేత్త
శుద్ధహృదయాంతరుండు వస్తువులయందు
నేపనులనైన నతఁడు నిర్లేపుఁడగును. ౬౪

గీ. చూచుచున్నను వినుచున్న నోఁకుచున్న
నెల్లవేళల నిస్తర్షకృతమనంబు
గలిగి సర్వభావముల నొక్కటిగ నుండు
నాత్మవేదిని మించు ధన్యాత్ముఁ డేడి ? ౬౫

గీ. నిత్యమును నిర్వికల్పమై నెగడునట్టి
యాకసంబును బోలు మహాత్మునకును
నేది యాభాస మేది సంస్మృతి తలంప
నేది సాధ్యంబు సాధన మేమి యుండు ? ౬౬

గీ. ప్రకృతిసిద్ధసమాధి యొప్పారుచుండ
ఛిన్నరహితంబుగా నది చెలఁగుచుండ

అర్థసన్న్యాసి, బ్రహ్మైకస్వరూపుఁడు, అకృత్రిమము ననవచ్ఛిన్నము నగుసమాధినిరూఢుఁ డగుయోగియే జయశీలుఁడు.

బహునాత్ర కిముక్తేన జ్ఞాతతత్త్వో మహాశయః,
భోగమోక్షనిరాకాంక్షీ సదా సర్వత్ర నీరసః. ౮౧

వేయేల! తత్త్వజ్ఞుఁ డగుమహాశయుఁడు భోగమోక్షనిరాకాంక్షియై సదా దేనియందును సక్తత లేకుండును.

మహదాది జగద్ద్వైతం నామమాత్రవిజృంభితమ్,
విహాయ శుద్ధబోధస్య కిం కృత్యమవశిష్యతే. ౮౨

నామమాత్రముగా విజృంభించినమహదాది జగద్ద్వైతమును విడిచి శుద్ధబోధస్వరూపుఁ డగుమహాత్ముఁడు చేయఁదగిన దేమున్నది?

భ్రమభూతమిదం సర్వం కించిన్నాస్తీతి నిశ్చయీ,
అలక్ష్యస్ఫూరణః శుద్ధః స్వభావేనైవ శామ్యతి. ౮౩

ఈసమస్తము భ్రమమాత్రమే కాని యన్య మేమియుఁ గాదని నిశ్చయించి, యలక్ష్యస్ఫూర్తి గన్నశుద్ధుఁడు స్వభావముచే శాంతి నందును.

శుద్ధస్ఫురణరూపస్య దృశ్యభావ మపశ్యతః,
క్వ విధిః క్వ చ వైరాగ్యం క్వ త్యాగః క్వ శమోఽపి వా.

శుద్ధస్ఫురణరూపుఁడై దృశ్యభావమునే కాంచనిమహాత్మునకు విధి, వైరాగ్యము త్యాగము శమము మున్నగువానితో నేమిసంబంధము?

స్ఫురతోఽనంతరూపేణ ప్రకృతిం చ న పశ్యతః,
క్వ బంధః క్వ చ వా మోక్షః క్వ హర్షః క్వ విషాదితా.

అనంతరూపమునఁ బ్రకాశించుచుఁ బ్రకృతినే కాంచనిమహాత్మునకు బంధమోక్షములు, హర్షవిషాదములు నెట్టుండును?

బుద్ధిపర్యంతసంసారే మాయామాత్రం వివర్తతే,
నిర్మమో నిరహంకారో నిష్కామః శోభతే బుధః. ౮౬

నర్థసన్న్యాసి పూర్ణాత్ముఁ డపారవాంబు
ముడము నందుమహాయోగి కౌదవు జయమఁ. ౨౭

గీ. ఆత్మతత్త్వజ్ఞుఁ డైనమహాశయుండు
వేయు నేటికిఁ గన సర్వవిషయములను
భోగమోక్షనిరాకాంక్షి బుధవరుండు
నిత్యనిస్సంగియై యాత్మ నెగడుచుండు. ౨౮

గీ. నామమాత్రస్థితం బహ మాదియైన
జగమునందలి యద్వైతసరణి విడిచి
శుద్ధబోధానవద్యుఁ డౌ శుభకరుండు
చేయఁగాంచుట కేమింక సిద్ధమగును ? ౨౯

గీ. ఈసమస్తంబు భ్రమమాత్రమే యటంచు
నేదియును లే దటంచును హృది నెఱింగి
లక్ష్యరహితస్ఫురణమె యెల్లను గలట్టి
శుద్ధుఁడు స్వభావశాంతి విశుద్ధుఁ డగును. ౩౦

గీ. తాను శుద్ధస్ఫురణరూపుఁ డైనవాఁడు
దృశ్యభావముఁ గాంచనిధీరవరుఁడు
చేయవలసినవిధియు సర్చింపఁదగిన
యమలవైరాగ్యత్యాగశమములు గలవె ? ౩౧

గీ. ప్రకృతిఁ గానకే యప్రతర్క్యంబునైన
దీపితానందరూపసంస్థితిఁ గలాఁడు
బంధమోక్షంబు లనియెడు ద్వంద్వములను
హర్షదుఃఖములనువాని నంటఁ గనునె ? ౩౨

గీ. ఆత్మబోధోదయం బగునంతవఱకు
భవము గలదు మాయామాత్రవర్తనమున

ఆత్మజ్ఞానము కలుగువఱకే యీయందుసంసారమున మాయయే గలదు. నిర్మమత, నిరహంకారము, నిష్కామము గలవాఁ డిందు శోభించును.

అక్షయం గతసంతాపమాత్మానాం పశ్యతో మునేః,
క్వవిద్యా చ క్వ వా విశ్వం క్వ దేహోఽహం మమేతి వా,

అక్షయము సంతాపశూన్యమునగు నాత్మను గన్నయోగికి విద్య, విశ్వము, దేహాభిమానము మున్నగున వేల కలుగును ?

నిరోధాదీని కర్మాణి జహాతి జడధీర్యది,
మనోరథాన్ ప్రలాపాంశ్చ కర్తుమాప్నోత్యతత్క్షణాత్. ౭౫

నిరోధమును విడిచిన జడబుద్ధిమనస్సు వెంటనే కోరికలకుఁ బ్రలాపములకు నెరయై చెడిపోవును.

మందః శ్రుత్వాపి తద్వస్తు న జహాతి విమూఢతామ్,
నిర్వికల్పో బహిర్యత్నాదంతర్విషయలాలసః. ౭౬

మందుఁడు తత్త్వమును విన్నను దనమౌఢ్యమును వీడఁడు. పైకి నిర్వికల్పస్థితి నున్నట్లు కనఁబడినను లోపల విషయలాలసుఁడై విషయముల నర్థించుచునే యుండును.

జ్ఞానాద్గలితకర్మా యో లోకదృష్ట్యాపి కర్మకృత్,
నాప్నోత్యవసరం కర్తుం వక్తుమేవ న కించన. ౭౭

లోకదృష్టిలోఁ గర్మ చేయుచున్నట్లు కనఁబడినను జ్ఞానోదయముతోఁ గర్మములు నశించినమహాత్ముఁ డేమి చేయుటకు నేమి పల్కుటకు నవసరము గాంచఁడు.

క్వ తమః క్వ ప్రకాశో వా హానం క్వ చ న కించన,
నిర్వికారస్య ధీరస్య నిరాతంకస్య సర్వదా. ౭౮

నిర్వికారుఁ డగుధీరపురుషుఁడు నిత్యనిరాతంకుఁ డగుట నాతని కంధకారప్రకాశములు, త్యాగాదికము నేమియుం లేవు.

కామరహితుఁడు మఱి యహంకారరహితుఁ
డగుచు నిర్మముఁ డగుబుధుఁ డలరుచుండు. ౨౩

గీ. అక్షయంబును సంతాపహారి యైన
యాత్మరూపము గన్నమహాత్ములకును
నేది విద్యయు మఱి విశ్వ మేది 'నేను'
'దేహ' మిదియు 'నా' దన్నబుద్ధియుఁ దలంప. ౨౪

గీ. ఏక్షణంబున జడుఁడు డా నిచ్ఛ విడుచు
మతినిరోధాదికంబు నామాత్రమునసె
బహుమనోరథములుఁ బ్రలాపములు వచ్చి
ముట్టడింపఁగ బుద్ధి సమ్మోహిత మగు. ౨౫

గీ. అమలతత్త్వార్థ మది విన్నయంత నైన
విడువఁడు విమూఢబుద్ధి మందుఁడు తలంపఁ
బైకిఁ గనఁబడు నిర్వికల్పత్వబుద్ధి
నతనిలోపల విషయలోలతె చెలంగు. ౨౬

గీ. జ్ఞానవిగళితకర్ముఁడై సకలలోక
దృష్టిఁ గర్మంబులను జేయుతీరు గనియుఁ
జేయుటకుఁ బల్కుటకును గొంచెంబునైన
నవసరంబును గనఁడు మహాత్మయోగి. ౨౭

గీ. నిర్వికారనిరాతంకనిర్మలుఁ డగు
ధీవరేణ్యున కెప్పుడైన నావహిలునె
తమము కాని ప్రకాశవత్త్వమ్ము గాని
త్యాగ మది గాని యితర మేదైనఁ గాని. ౨౮

క్వ ధైర్యం క్వ వివేకిత్వం క్వ నిరాతంకతాపి వా,
అనిర్వాచ్యస్వభావస్య నిస్స్వభావస్య యోగినః. ౭౯

అనిర్వాచ్యము, నప్రకృతము నగుస్వభావము గలయోగికి ధైర్యము, వివేకము, నిరాతంకము మున్నగువానితో నేమి సంబంధము?

న స్వర్గో నైవ నరకో జీవన్ముక్తిర్న చైవ హి,
బహునాత్ర కిముక్తేన యోగదృష్ట్యా న కించన. ౮౦

యోగదృష్టికి స్వర్గనరకములు కాని జీవన్ముక్తి కాని వేయేల నేదియును గూడ లేనే లేదు.

నైవ ప్రార్థయతే లాభం నాలాభే నానుశోచతి,
ధీరస్య శీతలం చిత్తమమృతేనైవ పూరితమ్. ౮౧

అమృతపూరితమైన ధీమంతుని శీతలహృదయము లాభముం గోరదు. నష్టముపట్లఁ జింతింపను జింతింపదు.

న శాంతం స్తౌతి నిష్కామో న దుష్టమపి నిందతి,
సమదుఃఖసుఖస్తృప్తః కించిత్ కృత్యం న పశ్యతి. ౮౨

నిష్కామియగువాఁడు శాంతాత్ములను స్తుతింపఁడు; దుష్టాత్ములను నిందింపఁడు. సుఖదుఃఖములందు సముఁడు తృప్తుఁడునై యేపనియుఁ జేయనవసరముఁ గనఁడు.

ధీరో న ద్వేష్టి సంసారమాత్మానం న దిదృక్షతి,
హర్షామర్షవినిర్ముక్తో న మృతో న చ జీవతి. ౮౩

ధీమంతుఁడు సంసారమును ద్వేషింపఁడు. ఆత్మావలోకనము నపేక్షింపఁడు. హర్షవిషాదముల కతీతుఁడైనయామహాత్ముఁడు జీవియుఁ గాఁడు; మృతుఁడును గాఁడు.

నిస్స్నేహః పుత్రదారాదౌ నిష్కామో విషయేషు చ,
నిశ్చింతః స్వశరీరేఽపి నిరాశః శోభతే బుధః. ౮౪

గీ. కడు ననిర్వాచ్యసౌఖ్యభావకలితుఁ డైన
నిస్పృహాత్ముఁడు నాయోగసిద్ధులనకు
నేటిధైర్యము? మఱి వివేకిత్వ మేమి?
ఏటి దింక నిరాతంక మేమి గలుగు? ౭౯

గీ. స్వర్గనరకంబు లవి లేవు చనినపిదప
లేదు భువిని జీవన్ముక్త మహాదశయును
వేయునేల వచింపంగ విపులమౌఁగ
దృష్టియం దేమియును లేవు స్పష్ట మిదియ. ౮౦

గీ. ప్రార్థనముచేయ దెట్టిలాభమున కైనఁ
జింతఁ గనదు నష్టంబున కింత యైన
శీతలాకరధీవరచిత్త మెప్పుడు
నరయఁగ నమృతపూరిత మగు నిజంబు. ౮౧

గీ. శమితచిత్తుని స్తోత్రపాఠములచేత
దుష్టచిత్తుని నిందలతోడఁ గనఁడు
సమతనుండును సుఖదుఃఖములతోఁ దృప్తిఁ
జేయవలసినపని లేని సిద్ధవరుఁడు. ౮౨

గీ. ధీరపురుషుఁడు కనఁడు సంసారమందు
ద్వేషభావము నాత్మకద్రష్టుఁ గనఁడు
హర్షశోకవినిర్ముక్తుఁ డగుట నతఁడు
మృతుఁడు జీవియుఁ గానిసుస్థితిఁ జరించు. ౮౩

గీ. పుత్త్రదారలపయి మోహమును గనండు
విషయసుఖముల నిష్కామవిలసితుఁ డగు

భార్యాపుత్త్రాదులయందు మమకారము, విషయములందుఁ గోరిక, లేక నిష్కామియై, స్వశరీరముఁకైనను జింతలేక నిరాశియై యున్నబుధుని జన్మ మెంత ధన్యము !

తుష్టిః సర్వత్ర ధీరస్య యథాపతితవర్తినః,
స్వచ్ఛందం చరతో దేశాన్యత్రాస్తమితశాయినః. ౮౫

ఎచ్చటసూర్యుఁ డస్తమించునో యచట శయనించుచు స్వచ్ఛందముగాఁ దిరుగుచు యదృచ్ఛాలాభమున జీవించుధీమహితుఁడే సంతుష్టికి నిలయము.

పతతూదేతు వా దేహో నాస్య చింతా మహాత్మనః,
స్వాభావభూమివిశ్రాంతి విస్మృతాశేషసంసృతేః. ౮౬

స్వభావసిద్ధ మగుబ్రహ్మానందభూమిని విశ్రమించుచు జననమరణముల విషయమే మఱచి యుండుమహాత్ముఁడు తన దేహము నశించినను క్రొత్త దేహము గలిగినను జింతింపఁడు.

అకించనః కామచారో నిర్ద్వంద్వచ్ఛిన్నసంశయః,
అసక్తః సర్వభావేషు కేవలో రమతే బుధః. ౮౭

ఏదియుఁ గలిగియుండక స్వేచ్ఛాచారియై ద్వంద్వాతీతుఁడై సంశయములు నశించినవాఁడై సక్తత లేక సర్వభావములందుఁ గేవలుఁడై రమించు బుధుఁడే ధన్యుఁడు.

నిర్మమః శోభతే ధీరః సమలోష్టాశ్మకాంచనః,
సుభిన్నహృదయగ్రంథి ర్వినిర్ధూత రజస్తమః. ౮౮

మమకారము లేక, మట్టి, బంగారము, ఱాయి సమముగాఁ గాంచుచు హృదయగ్రంథులు విడిపోఁగా రజస్తమోగుణములు నశింప శోభించుధీరుఁడే మహాధన్యుఁడు.

సర్వత్రానవధానస్య న కించిద్వాసనా హృది,
ముక్తాత్మనో వితృప్తస్య తులనా కేన జాయతే. ౮౯

నిజశరీరంబుపైఁ జింత నిలుపఁ డెపుడు
బుధుఁడు చరియించు నైరాశ్యబుద్ధితోడ. ౭౩

గీ. తనకుఁ దాన లభించినదానిఁ దినుచు
నిచ్ఛవచ్చినరీతిఁ జరించుచుండి
యెచట సూర్యాస్తమయ మగు నచట నిలుచు
నట్టిధీరుఁడు సంతుష్టి కాలయ మగు. ౭౪

గీ. విస్మృతాశేషసంస్థితి వెలసి ధీర
జనుఁడు స్వాభావభూమి విశ్రాంతిగనుట
నాత్మదేహంబు పతితమే యైన మరల
జన్మమును గన్నఁ జింతింప సరకుగొనఁడు. ౭౫

గీ. కన నకించనుఁడై స్వేచ్ఛగాఁ జరించు
ఛిన్నసంశయ నిర్ద్వంద్వసిద్ధి గనియు
సర్వభావములందు ననసక్తబుద్ధి
బుధుఁడు రమియించుఁ గేవలాద్భుతవిధమున. ౭౬

గీ. నిర్మముండయి శోభించు నిజము బుధుఁడు
సముఁ డగును స్వర్ణలోష్టపాషాణములను
నతిసుభిన్నహృద్గ్రంథుల నలరుచుఁడు
ఘనరజస్తమ నిర్ధూత గౌరవమున. ౭౭

గీ. అనవధానత సర్వంబునందు నుండి
హృదయమందున వాసన యుంచుకైన

సర్వవిషయముల నుపేక్షాభావము గలిగి కామంతైర వాసనలు లేక తృప్తి ననుభవించు ముక్తపురుషునితో సాటి యెవ్వఁడును లేఁడు.

జానన్నపి న జానాతి పశ్యన్నపి న పశ్యతి,
బ్రువన్నపి న చ బ్రూతే కోఽన్యో నిర్వాసనాదృతే. ౯౦

ఎఱిఁగి యెఱుఁగనివాఁడుఁ జూచి చూడనివాఁడుఁ, బలికి పలుకని వాఁడు నొక్కవాసనారహితుఁడుదక్క వేఱెవ్వరును లేరు.

భిక్షుర్వా భూపతిర్వాపి యో నిష్కామః స శోభతే,
భావేషు గలితా యస్య శోభనాశోభనా మతిః. ౯౧

బిచ్చగాఁడైనను, జక్రవర్తి యైనను నిష్కామియై వస్తువులందు మంచిచెడ్డ లనుభావము లేనివాఁడే శోభించును.

క్వ స్వాచ్ఛన్ద్యం క్వ సంకోచః క్వ వా తత్త్వవినిశ్చయః,
నిర్వ్యాజార్జవభూతస్య చరితార్థస్య యోగినః. ౯౨

కృత్రిమము కాని యార్జవముచేఁ బరిపూర్ణుఁడై చరితార్థుఁడైన యోగి పుంగవునకు స్వచ్ఛందత, సంకోచము, తత్త్వనిశ్చయముల మాట చెప్పనేల?

ఆత్మవిశ్రాంతితృప్తేన నిరాశేన గతార్తినా,
అంతర్యదనుభూయేత తత్కథం కస్య కథ్యతే. ౯౩

ఆత్మవిశ్రాంతి నందినవాఁడు, తృప్తుఁడు, నిరాశ గలవాఁడు, నార్తి రహితుఁడు నగు మహాత్ముని యాంతరంగికానుభూతి లెవ్వ డెవనికిఁ జెప్పఁగలఁడు?

సుప్తోఽపి న సుషుప్తౌ చ స్వప్నేఽపి శయితో న చ,
జాగరేఽపి న జాగర్తి ధీరస్తృప్తః పదే పదే. ౯౪

సర్వకాలసర్వావస్థలయందు సంతృప్తి గలవాఁడు గాఢనిద్రయందును నిద్రింపనివాఁడే, స్వప్నములయందును శయింపనివాఁడే; మేలుకొనియుండియు మేలుకొననివాఁడే.

లేనిముక్తాత్ము నతితృప్తుఁ డైనవాని
తోడఁ బోల్పఁగఁదగినట్టివాఁడుఁ గలఁడె ? ౮౯

గీ. ఎఱిఁగియుండియు నెఱుఁగని యెఱుకవాఁడు
చూచుచుండియుఁ జూడని చూపువాఁడు
పలుకుచుండియుఁ బలుకనిపలుకువాఁడు
ఎవఁడు నిర్వాసనుఁడుగాక యింకొకండు. ౯౦

గీ. బిచ్చగాఁడైన నేమి క్ష్మాక్షీపతయైన
నేమి శోభిల్లుచుండు నిష్కామియైన
భావముల మంచిచెడ్డలు బోవఁద్రోలి
శోభగాంచును శోభనాశోభనముల. ౯౧

గీ. ఆర్జవ మనంతముగఁ గాంచి యతిశయముగ
ధన్యతం గాంచినట్టి తత్త్వజ్ఞునకును
గలవె స్వచ్ఛందసంకోచగణము లరయ ?
తత్త్వనిశ్చయమన్న దెంతటి దతనికి. ౯౨

గీ. ఆత్మవిశ్రాంతిచేఁ దృప్తినందునతఁడు
ఆశలన్నిటిఁ జంపి కృతార్థుఁ డగుట
నాంతరంగికమౌ వానియనుభవంబు
లెవని కెట్లెవ్వఁ డెప్పు డూహించి చెప్పు ? ౯౩

గీ. ధీరవర్యుఁడు పరమసంతృప్తుఁ డగుట
సుప్తుఁ డనరాదు వాని సుషుప్తినైన
స్వప్నములఁ గాంచుచున్నను శయనుఁ డనఁగ
రాదు ; జాగరంబున జాగరంబుఁ గనఁడు. ౯౪

జ్ఞః సచింతోఽపి నిశ్చింతః సేంద్రియోఽపి నిరింద్రియః,
సుబుద్ధిరపి నిర్బుద్ధిః సాహంకారోఽనహంకృతిః. ౯౬
జ్ఞాని చింతించుచున్నను నిశ్చింతుఁడే; ఇంద్రియార్థములనున్నను నిరింద్రియుఁడే. సుబుద్ధియయ్యు నిర్బుద్ధియే; సాహంకారి యయ్యు నిరహంకారియే.

న సుఖీ న చ వా దుఃఖీ న విరక్తో న సంగవాన్,
న ముముక్షుర్న వా ముక్తో న కించిన్న న చ కించన. ౯౭
అట్టిమహాయోగి సుఖియుఁ గాఁడు, దుఃఖియుఁ గాఁడు, అసంగియుఁ గాఁడు, సంగియుఁ గాఁడు ముముక్షువుఁ గాఁడు. ముక్తుఁడుఁ గాఁడు, ఇదియుఁ గాఁడదియుఁ గాఁడు.

విక్షేపేఽపి న విక్షిప్తః సమాధౌ న సమాధిమాన్,
జాడ్యేఽపి న జడో ధన్యః పాండిత్యేఽపి న పండితః. ౯౮
ధన్యుఁ డగుమహాయోగి విక్షేపములందైన విక్షేపముఁ గనఁడు. సమాధియందును సమాధిఁ గనఁడు, జడత్వమందైన జడుఁడు గాఁడు, పాండిత్యము గల్గియుఁ బండితుఁడు గాఁడు.

ముక్తో యథాస్థితిస్వస్థః కృతకర్తవ్యనిర్వృతః,
సమః సర్వత్ర వైతృష్ణ్యాన్న స్మరత్యకృతం కృతమ్. ౯౯
స్వస్థితియందుండి, కృత కర్తవ్యానుభావముల కతీతుఁడై సర్వమునను సమతతో నిష్కామియైనాఁడు చేసిన చేయవలసిన పనుల నూహింపఁడు.

న ప్రీయతే వంద్యమానో నింద్యమానో న కుప్యతి,
నైవోద్విజతి మరణే జీవనే నాభినందతి. ౧౦౦
స్తుతించిన సంతోషము, నిందించినఁ గోపము నట్టిమహాయోగి కాంచఁడు. ఆతఁడు జీవించుటలో నానందము మరణించుటచే దుఃఖము నందఁడు.

న ధావతి జనాకీర్ణం నారణ్య ముపశాంత ధీః,
యథాతథా యత్రతత్ర సమ ఏవావతిష్ఠతే. ౧౦౦
ఉపశాంతిగన్నమహాయోగి జనాకీర్ణప్రదేశమునకుఁ గాని యడవికిఁగాని పరుగిడఁడు ఏస్థితియందును నేస్థలమందును నాతఁడు సమముగనే యుండును.

గీ. చింతచేయుచునున్న నిశ్చింతుఁ డగును
సేంద్రియుండైన నగును నిరింద్రియుండు
అమలబుద్ధియె యైనను నగు నబుద్ధి
ఐన సాహంక్రియుఁడు నిరహంక్రియుండు. ౯౫
గీ. సుఖియుఁ గాఁడు దుఃఖియుఁ గాఁడు చూడ జ్ఞాని
సంగియును గాఁడు మఱియు నసంగి గాఁడు
ముక్తుఁడును గాఁడు మఱియు ముముక్షుఁ గాఁడు
ఇదియుఁ గాఁ డదిగాఁడు మఱెవియుఁ గాఁడు. ౯౬
గీ. క్రియకు విక్షేపములను విక్షేపి గాఁడు
మఱి సమాధుల నున్న సమాధి గనఁడు
జాడ్యమున నున్న వేళను జడుఁడు గాఁడు
పండితుఁడుఁ గాఁడు పాండిత్యపరుఁడునైన. ౯౭
గీ. కన యథాస్థితి స్వస్థత గన్న యతఁడు
కృతము కర్తవ్యమును నిర్వృతిని గన్న
యతఁడు సర్వసముండు ముక్తామలుండు
కృతము నకృతము గనఁడు వైతృష్ణ్యఁ డగుట. ౯౮
గీ. పరులు పొగడఁగఁ జూచి సంబరముపడఁడు
పరులు నిందింపఁ గాంచి కోపంబు గనఁడు
మరణమున్నను భయపడ మఱఁగఁ డతఁడు
జీవనానంద మావంతఁ జెందఁ డతఁడు. ౯౯
గీ. ధీపరుండు జనాకీర్ణమే వెదకఁడు
కానఁ డుపశాంతి కారణ్యగహ్వరములు
ఎట్టిస్థితినైన మఱియెట్టిపట్టునైన
సమముగా నుండి వెలుఁగు విజ్ఞానమూర్తి. ౧౦౦

# అష్టావక్రసంహితా

## ఏకోనవింశోఽధ్యాయః

---

### ఆత్మస్థిత ప్రకరణము

జనక ఉవాచ:—

తత్త్వవిజ్ఞానసందంశమాదాయ హృదయోదరాత్,
నానావిధపరామర్శశల్యోద్ధారః కృతో మయా. ౧

నాహృదయోదరమునుండి తత్త్వవిజ్ఞాన మను పట్టుకార్త చే నానా విధపరామర్శ లనుముండ్లను దీసివేసితిని.

క్వ ధర్మః క్వ చ వా కామః క్వ చార్థః క్వ వివేకితా,
క్వ ద్వైతం క్వ చ వాఽద్వైతం స్వమహిమ్ని స్థితస్య మే. ౨

ఆత్మమహిమాన పేతుండ నైననాకు ధర్మార్థకామమోక్షాదికములతోఁ బనియేమి? వివేకితాద్వైతాద్వైతములు నా కేల?

క్వ భూతం క్వ భవిష్యద్వా వర్తమానమపి క్వ వా,
క్వ దేశః క్వ చ వా నిత్యం స్వమహిమ్ని స్థితస్య మే. ౩

ఆత్మమహిమాస్థితుఁ డనైననాకు భూతభవిష్యద్వర్తమాన కాలములతోఁ బనియేమి? దేశనిత్యత్వములతో మాత్ర మేమిసంబంధము?

క్వ చాత్మా క్వ చ వా నాత్మా క్వ శుభం క్వాశుభం తథా
క్వ చింతా క్వ చ వా చింతా స్వమహిమ్ని స్థితస్య మే. ౪

ఆత్మానందస్థితుఁడ నైననాకు ఆత్మానాత్మలు, శుభాశుభములు, చింతాచింతలు నెక్కడివి? లేవు.

# అష్టావక్రసంహిత

## ఏకోనవింశాధ్యాయము

---

### ఆత్మస్థితిప్రకరణము

జనకుఁడు:—

గీ. ఆత్మహృదయోదరంబున యందు నుండి
తత్త్వవిజ్ఞానసందంశ తతులచేతఁ
బెఱికివైచితి దేవ! సంప్రీతితోడ
బహువిధవిమర్శ లనుశల్యభావసమితి. ౧

గీ. ఆత్మమహిమాస్థితుండనై నట్టినాకు
ధర్మ మదియేల? కామార్థతతు లికేల?
ఎది వివేకిత? మఱియింక నేలచూడ
ద్వైతభావము మఱియు నద్వైతచింత. ౨

గీ. ఆత్మమహిమాస్థితుండనై నట్టినాకుఁ
గలవె యెచ్చటనైనఁ ద్రికాలములును
దేశ మనునది యాకెట్లు దృశ్యమగును?
నిత్యపదమనుమోక్షంబు నే నెఱుంగ. ౩

గీ. ఆత్మమహిమాస్థితుండ నైనట్టి నాకు
నాత్మ యది లేదు మఱియు ననాత్మ లేదు
శుభము నశుభంబు లేదు యేచోటనైనఁ
జింతనయును లేదు మఱియు నచింత లేదు. ౪

క్వ స్వప్నః క్వ సుషుప్తిర్వా క్వ చ జాగరణం తథా,
క్వ తురీయా భయం వాపి స్వమహిమ్ని స్థితస్య మే. ౫

ఆత్మస్థితుఁడనైననాకు స్వప్నసుషుప్తులు, జాగరణము తురీయావస్థలు, భయము మున్నగున వేలయుండును?

క్వ దూరం క్వ సమీపం వా బాహ్యం క్వాభ్యంతరం క్వ వా,
క్వ స్థూలం క్వ చ వా సూక్ష్మం స్వమహిమ్ని స్థితస్య మే.

ఆత్మస్థితుఁడనైననాకు దూరసమీపములు, బాహ్యాభ్యంతరములు, స్థూలసూక్ష్మములు నేమియును లేదు.

క్వ మృత్యుర్జీవితం వా క్వ లోకాః క్వాస్య క్వ లాకికమ్,
క్వ లయః క్వ సమాధిర్వా స్వమహిమ్ని స్థితస్య మే. ౭

ఆత్మానందసంస్థితి నున్ననాకు మృత్యుజీవితములు, లోకలౌకికములు లయసమాధులు నేమియును లేవు.

అలం త్రివర్గకథయా యోగస్యకథవాప్యలమ్,
అలం విజ్ఞానకథయా విశ్రాంతస్య మమాత్మని. ౮

ఆత్మవిశ్రాంతిస్థితుఁడనైన నాకుఁ ద్రివర్గకథలుగాని యోగవిషయములుగాని విజ్ఞానచర్యలుగాని ప్రసంగింపవలసినవిషయములే కావు.

గీ. ఆత్మమహిమాస్థితుండ నైనట్టినాకు
స్వప్నము సుషుప్తియగున వెచ్చటను లేవు
అటులె జాగరణంబును నసలు లేవు
మఱి తురీయము భయము నాశమునకైన. ౫

గీ. ఆత్మమహిమాస్థితుండ నైనట్టినాకు
లేవు దూరసమీపముల్ లేవు నాకు
బాహ్యమాభ్యంతరంబు నేనగిదిగన్న
స్థూలసూక్ష్మంబు లనునట్టిచొప్పె లేదు. ౬

గీ. ఆత్మమహిమాస్థితుండ నైనట్టినాకు
మృత్యుజీవనభావ మేమియును లేదు
లోకమును లేదు చూడంగ లౌకికములు
లేవు లయసమాధులుకూడ లేవులేవు. ౭

గీ. ఆత్మవిశ్రాంతిస్థిరుఁడ నైనట్టినాకుఁ
బని గలదె పల్కఁ ద్రైవర్గభావకథల
యోగవిషయము పల్కఁ నే మోజ లేదు
మఱియు విజ్ఞానవిషయమై మాటలాడ. ౮

# అష్టావక్రసంహితా

## వింశోఽధ్యాయః

### జీవన్ముక్తిప్రకరణము

జనక ఉవాచ:—

క్వ భూతాని క్వ దేహో వా క్వేంద్రియాణి క్వ వా మనః,
క్వ శూన్యం క్వ చ నైరాశ్యం మత్స్వరూపే నిరంజనే. ౧

నిరంజన మగునాస్వరూపమున భూతములు, దేహము, నింద్రియములు, మనస్సు, శూన్యము, నైరాశ్యము నెచటఁ గలవు?

క్వ శాస్త్రం క్వాత్మవిజ్ఞానం క్వవా నిర్విషయం మనః,
క్వ తృప్తిః క్వ వితృష్ణత్వం గతద్వంద్వస్య మే సదా. ౨

ద్వంద్వాతీతుఁడ నైననాకు శాస్త్రము, విజ్ఞానము, నిర్విషయమగు మనము, తృప్తి, వితృష్ణత్వము నెక్కడివి?

క్వ విద్యా క్వ చ వా విద్యా క్వాహం క్వేదం మమ క్వ వా,
క్వ బంధః క్వ చ వా మోక్షః స్వరూపస్య క్వ రూపితా. 3

విద్యావిద్యలు, నహంకారమమకారములు, బంధమోక్షములు, స్వరూపముయొక్కరూపతలు నెక్కడివి?

క్వ ప్రారబ్ధాని కర్మాణి జీవన్ముక్తిరపి క్వ వా,
క్వ తద్విదేహకైవల్యం నిర్విశేషస్య సర్వదా. ౪

ప్రారబ్ధకర్మములు, జీవన్ముక్తి విదేహకైవల్యము మున్నగునవి కేవలనిర్విశేషున కెక్కడివి?

# అష్టావక్రసంహిత

## వింశాధ్యాయము

### జీవన్ముక్తి ప్రకరణము

జనకుఁడు:—

గీ. బహునిరంజనమత్స్వరూపంబునందు
భూతములు దేహమును నెట్టిపొందుఁ గనవు
ఇంద్రియంబు లటన్న వే యెచట లేవు
శూన్యమును లేదు నైరాశ్యశోభ లేదు. ౧

గీ. ద్వంద్వముల దాఁటినట్టియుత్తముఁడ నేను
నాకు శాస్త్రము నాత్మవిజ్ఞతయు లేవు
విషయరహితమనం బన వేఱె లేదు
తృప్తియును లేదు లేదు సంతృప్తికూడ. ౨

గీ. విద్యయు నవిద్యయును లేవు వివర మరయ
'నేను' 'ఇది' 'నాది' యనునట్టి వేను గనను
బంధమును లేదు మోక్షభావంబు లేదు
ఆత్మరూపపురూప మెయ్యదియు లేదు. ౩

గీ. ఏవి ప్రారబ్ధకర్మంబు లెంచి చూడ?
నెయ్యది కన జీవన్ముక్తి? యేది మఱియుఁ
దద్విదేహకైవల్యంబు తలఁచి చూడ
నిత్యనిర్విశేషుఁ డనఁగ నిర్మలునకు. ౪

క్వ కర్తా క్వ చ వా భోక్తా నిష్క్రియం స్ఫురణం క్వ వా,
క్వాపరోక్షం ఫలం వా క్వ నిస్స్వభావస్య మే సదా. ౪

నిత్యనిస్స్వభావుఁడ నగునాకు, కర్తృత్వభోక్తృత్వములు, నిష్క్రియాస్ఫురణములు అపరోక్షఫలములు నేమియును లేవు.

క్వ లోకః క్వ ముముక్షుర్వా క్వ యోగీ జ్ఞానవాన్ క్వ వా,
క్వ బద్ధః క్వ చ వా ముక్తః స్వస్వరూపేఽహ మద్వయే. ౫

స్వస్వరూపమున నద్వయత విరాజిల్లునాకు లోకము, ముముక్షువు, యోగి, జ్ఞాని, బద్ధుఁడు, ముక్తుఁడు నెవ్వరును లేరు.

క్వ సృష్టిః క్వ చ సంహారః క్వ సాధ్యం క్వ చ సాధనం,
క్వ సాధకః క్వ సిద్ధిర్వా స్వస్వరూపేఽహ మద్వయే. ౬

అద్వయ మగుస్వస్వరూపమున నలరునాకు సృష్టిసంహారములు సాధ్యసాధనసాధకులు, సిద్ధి యేవియును లేవు.

క్వ ప్రమాతా ప్రమాణం వా క్వ ప్రమేయం క్వ చ ప్రమా,
క్వ కించిత్ క్వ న కించిద్వా సర్వదా విమలస్య మే. ౭

నిత్యవిమలుండ నగునాకుఁ బ్రమాతప్రమాణప్రమేయప్రమములు కించిదకించిత్తులు నేవియును లేవు.

క్వ విక్షేపః క్వ చైకాగ్ర్యం క్వ నిర్బోధః క్వ మూఢతా,
క్వ హర్షః క్వ విషాదో వా సర్వదా నిష్క్రియస్య మే. ౮

నిత్యనిష్క్రియుండ నగునాకు విక్షేపము కాని యేకాగ్రత కాని నిర్బోధమూఢత్వములు కాని హర్షవిషాదములు కాని యేమియును లేవు.

క్వ చైష వ్యవహారో వా క్వ చ సా పరమార్థతా,
క్వ సుఖం క్వ చ వా దుఃఖం నిర్విమర్శస్య మే సదా. ౧౦

నిత్యనిర్విమర్శకుఁడ నగునాకు వ్యవహారపరమార్థములు సుఖదుఃఖములు, నేవియును లేవు.

గీ. నిత్యనిస్స్వభావుండనై నెగడునాకు
లేవు కర్తృత్వ భోక్తృత్వభావములు
లేవు నిష్క్రియసుస్ఫురణముల్ లేవు చూడ
నెలమి సపరోక్షమును జానిఫలముఁ గూడ. ౫

గీ. స్వస్వరూపాద్వయుండనై పరఁగు నాకు
లేదు జగము ముముక్షత లేదు చూడ
యోగియును జ్ఞానియును ముక్తియోగములును
బంధనంబును నాకు నావంత లేవు. ౬

గీ. స్వస్వరూపాద్వయానందచరితుఁ డేను
నాకు సృష్టియు సంహరణంబు లేవు
సాధ్యమే లేదు లేదిఁక సాధనంబు
సాధకుఁడు లేఁడు సిద్ధిప్రశంస లేదు. ౭

గీ. నిత్యవిమలప్రపూర్ణత నెగడునాకుఁ
బ్రమ ప్రమేయ ప్రమాణముల్ పఱల వెచటం
మఱి ప్రమాతయు లేదు నామమున కైన
లేదు కించి త్తకించిత్తు నేది లేదు. ౮

గీ. నిత్యనిష్క్రియాత్ముండనై నెగడు నాకు
లేదు విక్షేప మేకాగ్ర్య మేది లేదు
లేవు నిర్బోధమౌఢ్యముల్ లేవు చూడ
హర్షదుఃఖంబు లన్న వే యసలు లేవు. ౯

గీ. నిత్యనిర్విమర్శకుఁడనై నెగడునాకు
లేదు వ్యవహార మన్నదే లేదు చూడ
లేదు పరమార్థమునుగూడ లేనె లేదు
లేవు హర్షవిషాదముల్ లేవు నాకు. ౧౦

క్వ మాయా క్వ చ సంసారః క్వ ప్రీతి ర్విరతిః క్వ వా,
క్వ జీవః క్వ చ తద్బ్రహ్మ సర్వదా విమలస్య మే. ౧౧

నిత్యవిమలుండ నగు నాకు మాయాసంసారములు, ప్రీతివిరతులు, జీవబ్రహ్మములు నేవియును లేవు.

క్వ ప్రవృత్తిర్నివృత్తిర్వా క్వ ముక్తిః క్వ చ బంధనం,
కూటస్థ నిర్విభాగస్య స్వస్థస్య మమ సర్వదా. ౧౨

కూటస్థుఁడను నిర్విభాగుఁడను నిత్యస్వస్థుఁడను నగు నాకు ప్రవృత్తి నివృత్తులు ముక్తిబంధనములు నేవియును లేవు.

క్వోపదేశః క్వ వా శాస్త్రం క్వ శిష్యః క్వ చ వా గురుః,
క్వ చాస్తి పురుషార్థో వా నిరుపాధేః శివస్య మే. ౧౩

నిరుపాధికుఁడను శివంకరుఁడను నగు నాకు నుపదేశశాస్త్రములు, గురుశిష్యులు, పురుషార్థాదికము నేవియును లేవు.

క్వ చాస్తి క్వ చ వా నాస్తి క్వాస్తి చైకం క్వ చ ద్వయమ్,
బహునాత్ర కిముక్తేన కించిన్నోత్తిష్ఠతే మమ. ౧౪

అస్తిత్వ నాస్తిత్వములు, ఏకద్వయములు నేమియును లేవు. వేయేల, నానుండి బయలువెడలున దేమియును లేనే లేదు.

---

గీ. నిత్యవిమలాత్మరూపినై నెగడు నాకు
మాయయే లేదు సంసారమమత లేదు
లేదు సంప్రీతి విరతియు లేదు నాకు
లేవు నాకు జీవబ్రహ్మభావములును. ౧౧

గీ. నిర్విభాగుఁడఁ గూటస్థనిష్కలుఁడను
నిత్యనిజసుస్థితుండనై నెగడు నాకు
నెటఁ బ్రవృత్తియు మఱియు నివృత్తి లేదు
ముక్తియును లేదు ప్రబంధప్రసక్తి లేదు. ౧౨

గీ. నిత్యనిరుపాధి శివుఁడనై నెగడు నాకు
లేదు శాస్త్రము నుపదేశ మేది లేదు
లేదు గురుఁడు శిష్యుండును లేదు నాకు
లేదు పురుషార్థసంస్థితి లేనె లేదు. ౧౩

గీ. అస్తి నాస్తులు చూడ నా కసలె లేవు
ఏకము కా లేదు ద్వయము నా కెపట లేదు
తెలుప వేయేల నిఁక మమోత్తిష్ఠమైన
దేదియును లేనే లేదు వేయేల నింక. ౧౪

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1951

# సంస్కృతగ్రంథములు

## వేదాంతగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అద్వైతసంగ్రహము, తెలుఁగువచనము | ... | 0 | 3 |
| ఆత్మబోధము, సాంధ్రటీక | ... | 0 | 6 |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 6 |
| అపరోక్షానుభూతి ,, | ... | 0 | 6 |
| అద్వైతపంచరత్నములు, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 3 |
| అద్వైతోపదేశపంచరత్నములు ,, | ... | 0 | 3 |
| ఆత్మపూజ, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| ఆత్మవిద్యావిలాసము ,, | ... | 0 | 6 |
| ఆత్మానాత్మవివేకము ,, | ... | 0 | 6 |
| శివగీతా ,, | ... | 1 | 4 |
| అద్వైతవేదాంతపరిభాష, సవ్యాఖ్యానము, సంస్కృతము | ... | 1 | 8 |
| అద్వైతానుభూతి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 2 |
| ఉపదేశసాహస్రి, ఆంధ్రతాత్పర్యము | ... | 6 | 0 |
| కామకళావిలాసము | ... | 2 | 8 |
| విద్యారణ్యకృతజీవన్ముక్తిప్రకాశిక | ... | 3 | 0 |
| నారదపురూరవసంవాదము, తెనుగుపద్యము | ... | 0 | 3 |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్యము | | 5 | 0 |
| పంచీకరణము, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 0 | 3 |
| ,, తెనుఁగువచనము | ... | 0 | 3 |
| ప్రశ్నోత్తరరత్నమాల, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |
| బ్రహ్మసూత్రములు, మూలము | ... | 0 | 4 |
| ,, శంకరభాష్యము (సంస్కృతము) | ... | 10 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| భక్తివలనముక్తి | ... | 0 | 1 |
| భగవద్గీతాసారసంకీర్తనలు | ... | 0 | 4 |
| భగవద్గీతలు, మూలము, చిన్నసైజు | ... | 0 | 10 |
| భగవద్గీతలు, ఆంధ్రతాత్పర్యసహితము, కాలికోబైండు | ... | 2 | 0 |
| ,, జ్రాను పేపరు, కాకితము అట్ట | ... | 1 | 4 |
| ,, ద్వైతమతానుసారమైనవివరణము | ... | 1 | 0 |
| ,, శ్రీరామచంద్రసరస్వతీకృత ఆంధ్రటీకాతాత్పర్యము | | 6 | 0 |
| ,, కందార్థదర్పణములు, శ్రీసంపడి నాగనగారిది | ... | 1 | 4 |
| ,, ఆనిబిసెంటుగారి ఇంగ్లీషుతర్జుమా | ... | 0 | 12 |
| ,, తెనుగుపద్యములు, గోపీనాథము వేంకటకవిది | | 1 | 4 |
| ఋభుగీత, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 0 |
| మహావాక్యదర్పణము, ఆంధ్రతాత్పర్యము | ... | 2 | 0 |
| శంకరగీతాభాష్యము, సంస్కృతము | ... | 2 | 8 |
| వేదాంతడిండిమము, తాత్పర్యసహితము | ... | 0 | 4 |
| సనత్సుజాతీయము, సటీక | ... | 0 | 8 |
| సదాముక్తిసుధార్ణవము, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | | 0 | 10 |
| రామగీతా, చిన్నసైజు | ... | 0 | 8 |
| శంకరవిజయము, సవ్యాఖ్యానము | ... | 2 | 8 |
| వివేకచూడామణి, ఆంధ్రతాత్పర్యసహితము | ... | 2 | 0 |
| సౌందర్యలహరి, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 0 | 12 |
| శాంతివిలాసము , | ... | 0 | 6 |
| శుకాష్టకము ,, | ... | 0 | 2 |
| యజ్ఞవరాహభగవద్గీత-తాత్పర్యసహితము | ... | 3 | 0 |
| వ్యవహారపంచకము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 2 |
| విచారచంద్రోదయము, తెనుఁగువచనము | ... | 0 | 10 |
| వేదాంతస్తోత్రపంచకము, తాత్పర్యము | ... | 0 | 6 |

# స్తోత్రములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| దేవీస్తోత్రకదంబము | ... | 0 | 12 |
| తులసీస్తోత్రకదంబము | ... | 0 | 4 |
| దక్షిణామూర్తిస్తోత్రము, ఆంధ్రపద్యతాత్పర్యసహితము | ... | 0 | 3 |
| దేవీసప్తశతి (మన్త్రశాస్త్రము) | ... | 0 | 10 |
| శివమహిమ్నస్తోత్రము, టీక-తాత్పర్యసహితము | ... | 1 | 0 |
| ప్రాతఃస్మరణము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 4 |
| దేవీఖడ్గమాల, చిన్నసైజు | ... | 0 | 2 |
| త్రైలోక్యమోహనకవచము, త్రిపురసుందరీస్తోత్రము, త్రిపురాస్తవరాజము | ... | 0 | 6 |
| నవగ్రహస్తోత్రము, చిన్నసైజు | ... | 0 | 8 |
| శ్రీగుణరత్నకోశము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 8 |
| హరిమీడేస్తవము, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| శ్యామలాదండకము, సటీక | ... | 0 | 3 |
| స్తోత్రరత్నపంచకము, తాత్పర్యసహితము | ... | 0 | 8 |
| దశావతారస్తోత్రము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | ... | 0 | 4 |
| పరమేశ్వరస్తోత్రకదంబము, చిన్నసైజు | ... | 0 | 12 |
| బ్రహ్మస్తుతి, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 3 |
| భజగోవిందము, సటీక | ... | 0 | 3 |
| మృత్యుంజయమానసికపూజ, చిన్నసైజు | ... | 0 | 2 |
| ముకుందమాల, సటీక ,, | ... | 0 | 6 |
| రామబ్రహ్మమానసికపూజ ,, | ... | 0 | 2 |
| లక్ష్మీనృసింహస్తోత్రము, సటీక ,, | ... | 0 | 3 |
| లక్ష్మీనారాయణహృదయము ,, | ... | 0 | 3 |
| లక్ష్మీస్తోత్రరత్నత్రయము, సాంధ్రటీకాతాత్పర్యము | | 1 | 0 |